# గృహలక్ష్మి

స్త్రీల సచిత్ర మాసపత్రిక

# GRIHALAKSHMI

LADIES' TELUGU MONTHLY



'GRIHALAKSHMI' GRIHA

సంపాదకుడు

డాక్టరు కె. యన్. కేసరి

సంపుటము ౧౭ జనవరి 1948 సంచిక ౧




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్థసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతిలేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువయైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్రి ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయువలెను భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామకే వ్రాయవలయును. చెక్కులు,మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# శ్రీ సర్వజిత్ నామ సంll పుష్యమాసము

| | | | |
|---|---|---|---|
| | 12 | సో | శు పా 22-42 ఉ షా 22-38 హర్ష 16-21 బ 22-42 రా 6-2 |
| | 13 | మ | వి 29.3 శ్ర 30-1 వజ్ర 18-23 కౌ 29-3 రా 13-23 భోగిపండుగ |
| | 14 | బు | త 35-21 ధ 31-22 సిద్ధి 20-26 తై 2-12 రా 29-42 మకర సంక్రాంతిపండుగ |
| | 15 | గు | చ 41-39 శత 44-40 వ్యతీ 22-29 వణి 8-28 రా 27-52 కనుముపండుగ |
| | 16 | శు | పం. 37 15 పూ. భా 42-34 వరి 16-35 బ 5-16 సావిత్రీ గౌరీవ్రతారంభం |
| | 17 | శ | ష 40-19 ఉ. భా 46-49 పరి 16 46 బ 5-16 దివి 8.16 తుళువషష్టి. |
| జనవరి | 18 | ఆ | స. 41-42 రే 49 శివ 15-21 గ 11-1 దివి 18-14 |
| | 19 | సో | అ 42-22 అశ్వ 51-21 సిద్ధ 13-7 భ 12-2 రావి 13-59 |
| | 20 | మం | న. 41 33 భర 5-44 బా 10-58 దివి 15-33 |
| | 21 | బు | ద. 39-36 కృ 51-6 శుభ 5-44 తై 10-38 దివి 21-28 శాంబరీదశమి. |
| | 22 | గు | ఏ 36-24 రో 49-21 శుభ్ర 0-39 బ్రా 54-24 వ 8-0 రావి 2-9 జీవఏకాదశి |
| | 23 | శు | ద్వా 32-15 మృ 46-48 ఐ 43-25 బ 4-20 దివి 2-46 కూర్మద్వాదశి. |
| | 24 | శ | త్ర. 27-26 ఆరుద్ర 43-16 వై 42-11 తై 27-26 దివి 6-34 |
| | 25 | ఆ | చతు. 21-56 పున 39-33 విష్కు 33-53 వ 21-56 దివి 11-25 హిమశోధన పూర్ణమి. |
| 1948-వ సంll | 26 | సో | ○ పౌర్ణమి 16-23 పుష్యం 35-23 ప్రీ 25-48 భ 16-23 పాడ్యమితిథి. |
| | 27 | మం | కృ. పా 10-36 ఆశ్లే 31-22 ఆయు 18-10 కౌ 10-36 దివి 5-15 |
| | 28 | బు | ది. 4-3 తి 54-15 మ 27-7 సౌ 10-7 గ 4-34 ర 18-0 |
| | 29 | గు | చ 53-30 పుబ్బ 23-27 సో 2-34 అతి 52-33 ర 12-51 |
| | 30 | శు | పం. 50-8 ఉత్త 21-17 శు 49-33 కౌ 21 49 అర 13-5 |
| | 31 | శ | ష 45 21 హ 17-50 ధ్రు 42-23 గ 17-44 రవి 9-16 మందారషష్టి |
| | 1 | ఆ | స. 42-39 చి 16-10 శు 38-10 భ 14-0 ర 1-58 ఆదివరాహ జయంతి. |
| | 2 | సో | అ 41-1 స్వ 15-32 గం 32-42 బ 11 30 రవి 1 37 |
| | 3 | మం | న 41-43 విశా 16-10 వృద్ధి 29-12 తై 10-52 దివి 26-38 |
| | 4 | బు | ద. 42-39 అను 18-52 ధ్రు 27-41 వ 11-41 రవి 5-18 |
| | 5 | గు | ఏ. 43-35 జ్యే 21 0 వ 25-15 బ 13-7 |
| ఫిబ్రవరి | 6 | శు | ద్వా 46-53 మూ 25-12 హ 24 43 కౌ 15-14 దివి 20-54 |
| | 7 | శ | త్ర. 51-21 పూషా 30-32 వజ్ర 24-53 గ 16-3 రవి 24-18 శనిత్రయోదశి. |
| | 8 | ఆ | చతు. 56-20 ఉషా 36-31 సి 25-47 భ 23-51 రవి 19-22 |
| | 9 | సో | ● అమా 60-0 శ్రవ 43-11 వ్య 27-13 చత 29-23 రవి 26-0 |
| | 10 | మం | అమా 2-26 ధ 49-51 వరి 28-38 గ 2-29 |

# క్షయరోగమునకు గ్యారంటీ చికిత్స!

(వేనకు వేలు మృత్యుముఖమునుండి బైటపడిరి) — 20 రోజులకు సరిపోవు మందు రూ 20-0.0

ముందున్న స్థితి



"భస్మము సేవించినందున జ్వరముతగ్గినది. గుండె బాగుపడినది. తూకము హెచ్చినది. మామూలు ఆరోగ్యస్థితి ఏర్పడినది.

బి. వి. బలిగ
మైసూరు.

వివరములకు :

డాక్టరు:
ఎ.సి. రాజకన్నప్పన్

తర్వాతస్థితి



## (Son of) దేవి పండిట్ ఎ. సి. కన్నప్ప ముదలియార్

క్షయరోగ వైద్యశాల —3. ఎ. మొండవాకం టాంక్‌రోడ్డు, (కిల్లీస్ బస్సుస్టాండు దగ్గర)
కీల్పాక్ పోష్టు మదారాసు

---

## :జండూ బాలామృతం:




క్షీణించి అనారోగ్య వంతులుగ నుండు బిడ్డలకు అమృతము

సీసా 1-కి రు 1-1-0.

జండూవారి ఏజంట్లయొద్ద దొరుకును.

---

## SANDOW LEHYAM.
## శాండో లేహ్యము

రక్తవృద్ధి, ధాతుపుష్టి, అజీర్ణహర, బలకర తేజోకర పదార్థముల సారమును శరీరమునకు చేర్చునట్టి అమృతాహారమైన యీ లేహ్యము సమస్త జనులకు వరప్రసాదముగా భావింపదగియున్నది బలము, తేజస్సు, జీర్ణశక్తి, రక్తశుద్ధి, నరములు, మెదడు, జ్ఞాపకశక్తి, ఉత్సాహము—ఈ వర్గరాలకు ఔషధమున ఆహారమునగూడ అయివున్నది పిత్తము అరోచకము, నిద్రాక, మందము మేహము. వీటికికూడా ప్రశస్తము అన్ని తత్వములకును మేలుకలిగించును

డబ్బీ—ఒకశేరు రు. 3-0-0

(పోస్టేజి ప్రత్యేకము)

విక్టోరియా డిపో, నార్త్ మాడావీధి,
మైలాపూరు, మద్రాసు.



శ్రీ శ్రీ శ్రీ విజయనగరం మహారాణీసాహెబ్

విద్యావతీదేవిగారు




జయజయ గృహలక్ష్మి సఖి! జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనారత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

## స్వ వి ష యం

గత డిశంబరు సంచికతో మా "గృహలక్ష్మి" 16-వ సంపుటము పూర్తిఅయినది. ఈ జనవరిసంచిక 17-వ సంపుటము నారంభిస్తున్నది. గతసంపుటమునకు తమ అమూల్య రచనలనంపి మాకు తోడ్పడిన రచయితలందరికీ కృతజ్ఞతా పూర్వకమైన అభివందనములు. మేము ప్రచురింపజాలక నిలువఉంచినవే 200 కు మించి యున్నవంటే వివిధ రచయితలు మాయందుచూపిన ఆదరణ వెల్లడికాగలదు. ఇట్లే రాగలసంవత్సరములందున్నూ పాత రచయితలేగాక క్రొత్తవారున్నూ మాపత్రికయందు యథోచితంగా ఆదరణాభిమానాలు చూపుదురుగాక.

1942-46 మధ్య అజ్ఞాతావస్థకూడా కలుపుకుంటే నిజానికి "గృహలక్ష్మి"కి 20 సం॥ లు నిండి, 21-వ సం॥ ఆరంభమైనది. దేశానికిన్ని స్వాతంత్ర్యము సిద్ధించి, పత్రికా ప్రబోధానికి వేయిమార్గాలు, అవసరాలు ఏర్పడ్డవి. ఆంధ్రనారీలోకము ఈ 20 సం॥ లుగా చూపిన సోదరీ ప్రేమనే కనుపరచుచో "గృహలక్ష్మి" అన్నివిధముల వారిని సేవించగలదని విన్నవించుచున్నాము.

గతసంపుటపు రచనలను యథోచితముగా వేరొకచో సమీక్షిస్తాము. భవిష్యత్ రచయితలకుమాత్రము ఒక్కసూచన చేయదలచినాము. స్త్రీలు ముఖ్యముగా ఆటపాటల నభిలషించే కళాప్రియులు. కథలు, నాటికలు, ఖండకావ్యాలు వారికి ప్రియమైన నెచ్చెలులు. ఏమంటే 'కావ్యం కాంతాసమ్మితము' అనికదా ఆలంకారికుల మతము. కావున మా "గృహలక్ష్మి" వీటన్నిటినీ విరివిగా కోరుతుంది, ఆప్యాయంగా ప్రచురిస్తుందికూడా.

అయితే-ఈ 20-వ అఖిలభారత మహిళామహాసభ కధ్యక్షతవహింప వచ్చిన శ్రీమతి అనసూయాబాయికాళేగారు సభాసమావేశము జరుగనుండగా పల్కిన ఈవాక్యములు గమనార్హములు.—

"నూతన రాజ్యాంగచట్టంలో నిర్ణీతమైన వయస్సువచ్చిన వారందరికీ ఓటుచేసేహక్కు ఇవ్వబడినది. దానితో రాజ్యపరిపాలనా విషయంలో స్త్రీలబాధ్యత ఎక్కువైనది. జనాభాలో సగముమంది స్త్రీలు. కావున స్త్రీలు దేశముయొక్క సాంఘిక రాజకీయాధికార నిర్వహణంలో తమకర్హమైనభారం భాగం పంచుకోకపోతే ప్రజాప్రతినిధి ప్రభుత్వము (Democracy) అనేమాట అర్థరహితమవుతుంది. కావున ప్రతి స్త్రీహృదయంలో తనకు సంఘములో ఒకవ్యక్తిత్వమున్నదనీ, తానూ దేశవ్యవహారంలో పౌరసత్వపు హక్కుకలిగి ఉన్నాననీ-స్పృహ రేకెత్తింపజాలుచో ఈమహాసభయున్నూ సార్థకమవుతుంది."

ఆ మహాసభా నిర్వహణ బాధ్యతవహించిన ఆమె కామాటలనిపించడం న్యాయము. కోటీ యాభైలక్షల ఆంధ్రనారీమణులను సేవింపతలపెట్టిన మా "గృహలక్ష్మి" పత్రిక కున్నూ కర్తవ్యతారూపమున పైవాక్యము లన్వయిస్తున్నవి. అందుకు మేము బద్ధ కంకణులమే. అయితే మానిశ్చయమును పూరింప మాకు తోడ్పడగలవారు మారచ యితలే. కావున పాటగాని, పద్యంగాని, నాటికగాని, కథానికగాని, వ్యాసంగాని వ్యాఖ్యానంగాని-పైవాక్యములందలి అంతరార్థమును చిత్తగించి వారు తమరచనల సాగింతురు గాక. అట్లగుచో మేము కృతకృత్యులము కాగలమని విన్నవించుకొనుచున్నాము.

ఎడతెగని ఈశ్వరానుగ్రహమున మేమిట్లే "గృహలక్ష్మి"ని చిరకాలము సాగింప గలుగుదుముగాక.



# 20 వ అఖిలభారత మహిళా మహాసభ



ఇరువదవ అఖిలభారత మహిళా మహాసభ చెన్నపట్నమున జయప్రదముగా జరిగినందులకు మేమెంతయు సంతసించుచున్నాము.

స్వభావోక్తిలో ఆహ్వానసంఘాధ్యక్షురాలుపల్కిన ఆదరణవాక్యములు సమంజసములు. ఆమె మహిళోద్యమమున మద్రాసు ప్రాముఖ్యత నుగ్గడించుటలో చాలనిగ్రహమే చూపినదని మా యభిప్రాయము. శ్రీమతి అంబుజమ్మాళ్ తమిళనాడునే తలంచెనో, మద్రాసు రాష్ట్రమునంతయు నూహించెనో తెలియదుగాని రెండవదేయైనచో కస్తూరిబా ట్రస్టునిర్వహణ విషయమున శ్రీమతి దుర్గాబాయిగారి శ్రమ పేర్కొనకుండుట పొరబాటేమో యనితలంచెదము. అధ్యక్షురాలియుపన్యాసము ఉజ్జ్వలభావపూరితమయ్యు ఆచరణసాధ్యమై కార్యక్రమభూయిష్టమై స్త్రీసహజముగానున్నది. ఆమె పల్కినవానిలో పలువిషయములతో మేమేకీభవింతుముగాని—ఆర్థికకారణములకై ప్రజోత్పత్తిని పరిమితముగానైన నిరోధింపుడనుటమాత్రము మేము అంగీకరింపజాలము. ఆమె ఇందు కుపాయముల పూర్తిగవివరింపకున్నను పాశ్చాత్యదేశముల విరివిగానున్న సంతాననిరోధకసాధనముల నాశ్రయింపుమనుచున్నదా యని ఆ విషయమైపల్కిన ఒకటిరెండువాక్యములవల్ల మాకుస్ఫురించినది. ఇట్టిదానికిమేము వ్యతిరేకులమని ఇదివరకే 1947 మే నెలనాటి 5 వ సంచికలో ప్రధానవ్యాసమున వివరించియుంటిమి. ఇప్పుడీమె యుపన్యాసపుదృష్టిలో కూలంకషముగా పిదప చర్చింతుము.

సభవారున్నూ నేటివ్యవహారములనన్నిటిని ఓపికతో చర్చించి తగుతీర్మానముల గావించిరి. ఈ తీర్మానములన్నిటితోను పూర్తిగామేము ఏకీభవింపజాలకున్నను వ్యతిరేకింపవలసినవి వొకటిరెండుతప్ప వేరులేవు.

ప్రధానమగు విద్యావిషయకతీర్మానమున బాలబాలికలకు హైస్కూళ్లనిర్బంధసైనికశిక్షణముకూడదని అధికసంఖ్యాకులు తీర్మానించుట విచారకరము. నేడు భారతదేశమున పలుప్రాంతములజరుగుచున్న దుండగములనుగాంచుచో స్త్రీలకు ఆత్మరక్షణోపాయముల తర్ఫీదునివ్వవలసిన అగత్యము నీ సభాప్రతినిధులు ఏలగుర్తించరైరో దురూహ్యము. ఈ సందర్భమున గాంధీమహాత్ముని అహింసాసిద్ధాంతముపేర్కొనుట హాస్యాస్పదము. ప్రభుత్వములుచేబట్టిన కాంగ్రెసుమంత్రులు దానినెప్పుడోమరచిపోయినారు. వల్లతప్పివచ్చినప్పుడు స్త్రీకి ఆత్మరక్షణకై ఆయుధప్రయోగముతప్ప గత్యంతరము లేదనుట నిర్వివాదాంశము. ఆయుధప్రయోగమునేర్చిన వీరనారిపై ఏదుండగీడును 'చేయి'

మాట యట్లుంచి 'కన్నె' నవేయవెరచును. హైస్కూలు బాలబాలికలకు మిలిటరీశిక్ష నొసంగిన వారు "ఫాసిస్టుతత్వపరులు" అగుదురనుటయు అర్థములేనిమాట. అది దేశమందలి రాజకీయములబట్టి కలుగు పరిణామముగాని వేరుగాదు.

హైస్కూళ్ల బాలబాలికలకు నిర్బంధముగా నేర్పవలసినవానిలో "దాంపత్య ధర్మముల్ను" నొక్కటియని ఈ తీర్మానమున పేర్కొనబడినది. ఇది కేవలము మత గ్రంథములయందుగల ధర్మసూత్రములుమాత్రము కాదని స్పష్టమే; ఇందుకామ సూత్రములు నిమిడియుండునేమోయనుటకు సావకాశము లేకపోలేదు. దానిమంచిచెడ్డలు దీర్ఘముగా చర్చింపబడవలసినవి. అయితే మిలిటరీశిక్షణవల్ల — హైస్కూలుబాలబాలికలు "ఫాసిస్టుతత్వపరులు" అగుదురనితలంచినసభవారు ఆ లేతవయస్సుననే శాస్త్రముగానైన "దాంపత్యధర్మములు" నేర్చు బాలబాలికలు ఏ పులిబారినుండి వారినితప్పింపనుద్దేశమో ఆ కామవాంఛాపరులుకారా — అని ఏలయోచింపరైరో? ఇంతమాత్రమున మేమిది యేదో ఘోరవిషయముగాప్రదర్శించి మా పాఠకురాండ్రకు హడలుగొట్టుటలేదు. ఇది చాల అవశ్యమైనశాస్త్రమని చిరకాలమునుండి పాశ్చాత్యదేశముల ప్రచారముననున్నది. మనదేశమునకు నిది అపరిచితముగాదు. అయితే అదివేరురూపముననుండెను. ఇంతకు నీతీర్మానమును శ్రీమతులు ముత్తులక్ష్మిరెడ్డి, కొండపార్వతీదేవి, కామేశ్వరమ్మ మున్నగు జ్ఞానవృద్ధలు, వయోవృద్ధలు బలపరచిరి. అట్టివారివలన దీని పూర్తివివరములు తెలిసి మా పాఠకులకు క్రమక్రమముగా నెరుకపరుప నిచ్ఛగింతుము.

ప్రభుత్వము వారిటీవలగావించిన — రేషన్ కంట్రోళ్ల రద్దులను ఈ సభవారు సకారణముగా నాక్షేపించిరి, తిరిగీవానిని ప్రవేశపెట్టి, అవిజాగ్రత్తగా అమలుజరుగుటకుపాయములసూచించిరి. తన్మూలమున శ్రీ రాజాజీగారు వెటకారముగాఇచ్చిన సందేశమును, దానికి శ్రీ శాస్త్రిగారు గావించిన వ్యాఖ్యానమును సార్థకమొనర్చి — ఇది "పురుషులసభకాదు, స్త్రీలసభ" యని రుజువుపరచినారు.

మొత్తమున కీసభ ఇంత జయప్రదముగా జరిగినందులకు సభాప్రతినిధులను, సభానిర్వాహకులను మేము మిక్కిలిగా అభినందించెదము. ఈ సభాతీర్మానములు అమలు జరుపుటకై శ్రీమతి అనసూయాబాయి కాళేగారినాయకత్వమున నీ మహాసభ వారీ సంవత్సరములో తీవ్రకృషి సల్పుదురుగాకయని కోరుచున్నాము. ఆ కార్యక్రమమున వారికన్నివిధముల ప్రచారరూపమున మా "గృహలక్ష్మి" తోడ్పడగలదని దృఢముగా చెప్పగలము.



# 20 వ అఖిలభారత మహిళాసభ — చెన్నపట్నం

1947 డిశంబరు 29, 30, 31,—1948 జనవరి 1



## ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి అంబుజమ్మాళ్ గారి ఉపన్యాసము



భారతస్వాతంత్ర్యము సిద్ధించినపిదప సమావేశమగుచున్న ప్రథమ మహాసభ ఇదియే. యునైటెడ్ నేషన్స్ ఆర్గనైజేషన్ వారు మన సంస్థను మన్నించినందులకు కృతజ్ఞులము స్వతంత్రభారత రాజ్యమందును, విదేశములందును, శ్రీమతి సరోజినీదేవి, అమృతకౌర్, విజయలక్ష్మిపండిట్ గార్లు ముగ్గురు మహిళామణు లున్నా ఉన్నతోద్యోగములు వహించి భారతస్త్రీ సాంప్రదాయముల నిలువబెట్టుచున్నారు అని పల్కిన పిదప నామె మద్రాసునందు 30 సంవత్సరముల క్రిందట మహిళోద్యమము నారంభించిన ఆనిబిసెంటును, 20 సం॥ క్రిందట ప్రథమమహిళాసభ నేర్పాటుచేసిన కజిన్సు సతిని, ప్రప్రథమమున శాసనసభకు ఎన్నుకొనబడి ఉపాధ్యక్షులై, వివిధ స్త్రీ ఉద్యమములకు చేయూత నిచ్చిన శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డిగారిని ప్రస్తుతించి, మద్రాసు రాష్ట్రమున పార్లమెంటరీ కార్యబాధ్యత లోసంగ బడుచున్నవనియు, జాతీయ సమరమందును, సంఘసంస్కరణమందును మద్రాసు స్త్రీలు ముందడుగు వేసిరనియు, మిగతా రాష్ట్రముల కన్న పేదదయ్యు వివిధస్త్రీ యుద్యమముల దీక్షతో నడుపుచున్నదని వివరించినది కస్తూరిబా ట్రస్టు విషయమున శ్రీమతి డా॥ సౌందరరామచంద్రన్ గారు రొనర్చుచున్న ఫలితమైన సేవనుగ్గడించిరి. స్త్రీవిద్యా వ్యాపకమందును మద్రాసుదే పైచేయి యని తెల్పి కళలు, లలితకళలయందభిరుచి, అభిమానములను వివరింప శ్రీమతి రుక్మిణీ అరెండేల్ గారి 'కళాక్షేత్రము'ను తార్కాణముగా చూపినది ఇదివరలో ఈరాష్ట్రమున రాష్ట్రీయ భాషల ప్రోత్సహమునకు ఆంగ్లభాషా ప్రాముఖ్యత వల్ల ఆటంకం కలిగిన ఆటంకమును పేర్కొని స్వాతంత్ర్యసిద్ధి యనంతర మావిషయమున జరుగుచున్న ప్రయత్నముల ప్రస్తావించి, అచిరకాలములోనే రాష్ట్రీయ భాషలగు తెలుగు, తమిళ, కన్నడ, కేరళములను, అఖిల భారతరాష్ట్ర భాషయగు హిందూస్థానికి, అంతర్జాతీయ భాషయగు ఆంగ్లభాషను వాటి వాటికి అర్హమైన విధమున రాష్ట్రీయులు నేర్చి వ్యవహరింతురనినది. పరిపాలనా సౌష్టవమునకై భాషాప్రయుక్త రాష్ట్ర విభజన ఏర్పడవలసి యున్నను - వివిధ రాష్ట్రముల ఒద్దికతో అఖిల భారత దేశైక్యతకు తోడ్పడ వలయుననినది ఆంధ్ర తమిళ రాష్ట్రములు సఖ్యభావమున పెంపొందునని ఆసించినది. మద్రాసురాష్ట్రమునగల మతసామరస్యమును పేర్కొని తన్మూలమున ఇటీవలపడిన బాధితుల బాగొనర్చు ఉద్యమములు పెంపొందుటయు వివరించినది. దేశవిభజనమువల్ల ఏర్పడిన అల్లకల్లోలములను వర్ణించి 'మేము, భారత స్త్రీలమే ఈవ్యవహారమున పరిష్కర్తలగుచో ఇది జరిగి యుండదు లేదా ఈదారుణమగు రక్తపాతము, కఠోరమైన క్రౌర్యములు జరుగకుండానైనా పని జరిగి ఉండేది.' అన్నది

## శ్రీమతి కాళేగారి ఉపన్యాసము.

అంతట సభాధ్యక్షురాలు శ్రీమతి అనసూయాబాయి కాళే మృదుమధుర గంభీరస్వరముతో తన ఉపన్యాస్యాన్ని ఉపక్రమిస్తూ తొలుతగా భారత భాగ్యవిధాతయై బాపూజీకి వినతులర్పించినది అపూర్వమైన అహింసాసిద్ధాంతాన్ని ఉగ్గడించినది. భారతనారీమణులు జాతీయసమరంలో సంపూర్ణంగా పాల్గొనడానికవకాశం కల్పించినవాడు మహాత్ముడుగాన ఈమహాసభ ఆయనపట్ల కృతజ్ఞత వెల్లడించడం న్యాయమని వెల్లడించినది. లక్ష్మలాది మహిళామణులు అసమానమైన సాహసములొనర్చుట ఆయనకు నారీలోకంలోగల పలుకుబడికి తార్కాణమని నిరూపించినది సర్వవిధములా భారతస్వాతంత్ర్యంకొరకు అనేక బాధలనంది పాటుబడిన సోదరీమణులకు జోహారులర్పించినది "బ్రిటిష్‌వారితో పోరాడడంచేతనే స్త్రీలు మానవులనిపించుకున్నారు. అందుచేతనే భారతయువతులు బయటా ప్రాముఖ్యతవహించి పనిచేస్తున్నారు"

"మన పూర్వాధ్యక్షురాండ్రలో నొక్కతె కేంద్రప్రభుత్వంలో మంత్రిణి, మరొకరు ముఖ్యమైన విదేశరాజ్యంలో రాయబారి; వేరొక్కరు ప్రపంచరాజ్యసమితిలో సభ్యురాలు, మరొక్కరు ఆసమితిక్రింద నేర్పడ్డ మానవులహక్కులకమిటీలో సభ్యురాలు, ఇంకొకతె ఆసియాఖండదేశముల కార్యనిర్వాహకవర్గ సభ్యురాలు, వేరొక్కతె భారతజాతీయమహాసభ కార్యవర్గసభ్యురాలు, అందరికి తలమానికముగా పూర్వము ఈపదవి వహించియుండిన యొక్క పురంధ్రమణి యొకరాష్ట్రాధిపత్యము (గవర్నరు) వహించి రాణించుచున్నది

ఆపిదప ఆగస్టు (1947) న గావింపబడిన స్వాతంత్ర్యోత్సవపు ఆనంద తరంగములు, తరువాత మత కలహములచే భగ్నమైనదియు వివరించి, ఆకలహములందు జరిగిన దారుణములన్నియు విషాదముపొంగ నభివర్ణించి, తత్ఫలితముగా జనించిన శరణార్థసమస్యను ప్రస్తావించి—"ఇవంతయు రాజకీయముల మనము గావించిన రాజీనామాల ఫలితము కాదా? కావున మనము దీనిని భరింపవలదా?" అని గంభీరముగ ప్రశ్నించినది. "ఈశరణార్థుల నాదరించుపని స్త్రీలకె ముఖ్యమైనది ఈమహాసభవారిప్పటికే ఆ పనియందు నిమగ్నలై యున్నందులకు" సంతసము తెల్పినది

తరువాత ఈమహాసభ ఏర్పడినదాది ఈ24సం॥ ఎట్లు పరిణమించి వింతగా వ్యాపించినది వివరింపబడెను. రాజ్యాంగ చట్టనిర్మాణ సభవారికీ సభవారర్పించిన మెమోరాండము ప్రస్తావించి "అందు పూర్వమునుంచీ వచ్చుచున్న అననుకూల లోపములను తొలగింప కోరితిమేగాని ఎట్టిప్రత్యేకపు ఏర్పాట్లను వేడుకొనలేదు" అని సగర్వముగా పలికినది "పురుషులతో పోటీచేసి గెలువగలము వయోజనులకెల్ల ఓటుహక్కు కలుగుటచే మనచేతిలో గొప్పఆయుధము దొరికినది సరియైనసంఖ్యని చెప్పజాలనుగాని 10, 12, కోట్లమంది స్త్రీలకు ఓటుహక్కు ఏర్పడును. వీరందరికి కర్తవ్యము బోధింపవలసిన అగత్యముకలదు ఫ్రెంచిస్వాతంత్ర్యపు నినాదములలో—స్వాతంత్ర్యము లభించినది, సమత్వము, సోదరప్రేమ—మనకృషివల్ల నేర్పడవలయును."

ఆతరువాత దేశవిభజనమునువిషాదముతో ప్రస్తావించి, తిరిగీదేశమంతయు నైక్యముగుగాకయని ఆశించినది.

ఇందుకు సరియైన విద్యావిధానంవలన భవిష్యత్సంతానములు ప్రబోధమందుట అవసరమని వివరించి, ప్రస్తుత విద్యావిధానమందున చాలదని నిరూపించినది. అవసరమైన విద్యావిధాన సూత్రముల పేర్కొని అందులకు వార్ధావిద్యావిధానమే సరియని నిర్ణయించినది

## "గృహిణియే గృహము"

ఈవిద్యావిధానము నమలుపరచుటలో స్త్రీలుధరింపగల ముఖ్యపాత్రనుసూచించి- "గృహిణియే గృహము" అన్న ప్రాచీన సంస్కృతవాక్యము నుదహరించినది. "అయితే స్త్రీ ఈవిధమున పూర్తిగ ఉపయుక్తురాలు కావలెనంటే- ముందు ఆమెకు సరియైనవిద్య అమరవలెను. ఆమెకు గృహమునందే గుడుగుడు గుంజమాడుటతో సరిపోరాదు" వెనుక సోషల్ రిఫారం పత్రికాధిపతి శ్రీ నటరాజన్ గారు "పలువురు బాలురకు విద్యగరపటంకన్నా ఒక్కబాలికకు విద్యచెప్పడంముఖ్యం, ఏమంటే ఆమె ఒకకుటుంబానికే కుదురు అవుతున్నది" అన్న వాక్యము నుదహరించి, ఈవాక్యమందలి స్వారస్యమును గ్రహింపబడలేదని విషాదమును వెలిబుచ్చి- ఆర్థికముగాకూడా బాలురవిద్యకన్న బాలికలవిద్యయే లాభసాటియని రూపించి "ఈవ్యవహారమునిక మనంచేబట్టినగాని పొసగదు" అని ధీమసముతో పల్కినది

తదుపరి- "భాషాప్రయుక్త రాష్ట్రవిభజన" కవసరమును చర్చించి బొంబాయి, మద్రాసు, సి. పి రాష్ట్రముల గుజరాతీ మహారాష్ట్ర, ఆంధ్ర తమిళ, మహాకోసల మహారాష్ట్ర దేశీయులమధ్య పొరపులు సమసి దేశైక్యతకు ఈవిభజన అచిరకాలమున జరుగుట అత్యవసరమని నొక్కి వక్కాణించినది.

"స్త్రీలు ఆత్మసంరక్షణోపాయముల బోధించువిధానము కనిపెట్టవలయును. నిజానికీనాడు జాతీయ స్త్రీసైనికవర్గమొకటి అత్యవసరము. అదికాశ్మీరమున అప్పుడే ఆరంభమైనందుకు సంతోషము వీరితరప్రాంతములకంపబడి పనిచేయగలుగుదురు"

స్వాతంత్ర్యసిద్ధితో ప్రభుత్వవర్గముల పనిముఖములు వృద్ధినందినవనియు, ఒక్కపురుషులే దీనినంతయు నిర్వహింప జాలరనియు, స్త్రీలును చేయిచేసుకొన్నగాని లాభములేదనియు వివరించినది.

అంతట- భయంకరముగా జనాభావృద్ధిపొందుతున్నదనియు, అందుకనుగుణ్యముగా ఆహారాదికము ఉత్పత్తి యగుటలేదనియు వివరించి- తల 1 టి ఆహారోత్పత్తి పా 1.2లు నుండి పా 1 కు దిగుబడియైనను ఎవ్వరును జనాభావృద్ధి నరికట్ట యోచింపరేయని దిగులుపడినది కావున ప్రజోత్పత్తిసంఖ్య- ఆహారాదికవసనోత్పత్తి కనుగుణ్యముగ నియమ నిబంధమొనర్పవలయునని ఉద్ఘాటించినది తన ఈవాదమునకనేక విధముల పోషించినది. ఆరోగ్యవిషయముగా, సాలీనా 2000000 మంది స్త్రీలు ప్రసవములలో చనిపోవుట, మరి 4000000 మంది స్త్రీలు తత్ఫలితము అనేకరోగముల పాల్పడుట తప్పటకిది యొక్కటే ఉపయోగమనినది. తానీవిషయమై చాలామంది మధ్యతరగతి స్త్రీలతోను కార్మికులతోను మాట్లాడితిననియు వారిందులకు సమ్మతించిరనియుపల్కి "ఈవిషయములో బోధింపబడవలసినవారు పురుషులే" అని ప్రకటించినది. ఈవిషయమున అవసరమైన ఉపాయముల బోధింపను తగినవైద్యాలయముల నెలకొల్పవలసినబాధ్యత ప్రభుత్వముదేఅని తెల్పి- తమపూర్వాధ్యక్షురాలొకతె కేంద్రమున ఆరోగ్యమంత్రిణియగుట ఈవిషయములోన ఆశాజనకముగనున్నదని పల్కినది

దేశమురాజకీయ పోరాటములో దగుల్కొనియుండగా ఉదాసీనముగాచూడబడిన సాంఘికవ్యవహారముల చక్కబెట్టుట, సాంఘివ్యవహారమంత్రిత్వము (A ministry of Social Affairs ఏర్పడవలెనని పల్కి ఆ శాఖక్రిందికిరాగల వివిధవిషయముల వివరించినది. ఈ మంత్రివర్గముక్రింద "నూతనమనుస్మృతి" గడింపబడవలెనని ఆశించినది.

భరతవాక్యముగానిట్లు పల్కినది —

"స్త్రీశక్తిస్వరూపిణియందురు. మనశక్తులన్నిటిని ఈదేశాభివృద్ధికై కేంద్రీకరించి వినియోగించుతాము,"

## మహాసభ వృత్తాంతము.

చెన్నపట్నమున ఈ డిసెంబరాంతమున అఖిలభారతమహిళామహాసభవారి ఇరువదవ వార్షికసమావేశ మతి వైభవముగా జరిగినది సభాప్రారంభ దినమగు 29 వ తేదిన - తేనాంపేట యందలి తమిళనాడు కాంగ్రెసు భవన మావరణలో విశాలమగు పందిరియందు - దేశమందలి వివిధప్రాంతముల నుండి విచ్చేసిన 500 మంది నారీశిరోమణులు వచ్చి ఆశీనులుకాగా సభయంతయు నిండార విరియబూచిన తామరకొలను వలె యొప్పారినది. ఉన్నతమగు వృక్షములతో నలరారు ఆప్రదేశ మంతయు నొకఋషివాటికయా యనిపించినది భారతీయ మహిళా ప్రతినిధులేగాక బర్మా, చీనా, ఇండోనేషియా, సింహళము, బ్రిటన్, అమెరికాలనుండి ఆయాదేశముల మహిళోద్యమముల నడుపు నారీమణులు రాయబారులై వచ్చిరి. వీరందరికి తోడు ఆహ్వానితులై కొందరు పురుషపుంగవులు విచ్చేసిరి. వారిలో గవర్నరు (మద్రాసు), కొందరు మంత్రులు, మేయరు ఇత్యాదులందరు కలరు.

సభాసమావేశము దేవగాయని శ్రీమతి యం యస్. సుబ్బలక్ష్మిగారి ప్రార్థన సంకీర్తనముతో ప్రారంభమైనది. విరమించు కొనుచున్న సభాధ్యక్షురాలగు శ్రీమతి రామారావు సతి ఉచిత వాక్యముల తనపని వివరించి, పరిస్థితుల వర్ణించి, రాగల అధ్యక్షురాలు శ్రీమతి అనసూయాబాయి కాళేగారి సామర్థ్యము నగ్గడించి, ఆమెనధ్యక్షత వహింప కోరగా శ్రీమతి డాక్టరు ముత్తులక్ష్మి రెడ్డిగారామోదించిరి. అంత కరతాళధ్వనుల మధ్య శ్రీమతి అనసూయా బాయిగారు అధ్యక్షత వహించిరి.

పిదప అధ్యక్షురాలి కోరికపై సభా కార్యదర్శిని శ్రీమతి ఊర్మిళా మెహతా సభకు ఆహ్వానింపబడిన పెద్దలు - పంపిన సందేశములను సభవారికి శ్రుతపరచిరి. సందేశములంపిన వారిలో ముఖ్యులు నెహ్రూ, రాజాజీ, సరోజినీదేవి, మౌంటుబాటన్ సతి మున్నగువారు కలరు.

అంతట క్రమముగా ఆహ్వాన సంఘాధ్యక్షురాలు శ్రీమతి అంబుజమ్మాళ్ గారును, సభాధ్యక్షురాలును, తమ తమ యుపన్యాసముల (వీనిని వేరుగా ప్రచురించితిమి. గృ॥ సం॥) నొసంగి సభాసదుల నానందాబ్ధి నోలలాడించిన పిదప - ఇతర దేశములనుండి వచ్చిన ప్రతినిధులు తమ తమ సందేశముల నిచ్చిరి. ఆవెంట ఆహ్వానితులైన పెద్దలు శ్రీ టి. ఆర్ వెంకట్రామశాస్త్రి, డా. కజిన్సు ప్రభృతులు కేంద్రమున ఆరోగ్య శాఖామంత్రిణి శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ తోలుతగా సభవారికి హితోపదేశముల గావించిరి.

అంత క్రమముగా 1947 డిశంబరు 30 31 తేదిలలోను, జనవరి (1948) 1 తేదినను సభజరిగినది. వివిధ తీర్మానములు విరివిగా చర్చింపబడి తీర్మాంపబడినవి. (ఈతీర్మానములన్నిటిని విడిగా ఇచ్చుచున్నాము. గృ॥ సం॥)

### విదేశములనుండి వచ్చిన సుదతీమణులు:

ఇండోనేషియా నుండి వచ్చినవారు శ్రీమతులు డా పులియాంతో సుఖోంతో పునారో. ఉత్తమ సూరధర్మ, సితారో హీరావధి బ్రిటన్ మెక్లిన్ దొరసాని. సింహళం ఫెర్నాన్డిస్ సతి. చీనా: సర్నాకీ - సతి పుదుచ్చేరి పాల్ కన్య మున్నగువారు.

### క్రొత్తకార్యనిర్వాహకులు.

అధ్యక్షురాలు, శ్రీమతి అనసూయాబాయికాళే. ఉపాధ్యక్షురాలు లీలామణిబాయి సుకన్య హన్నాసేన్, రేణుకారే, అంబుజమ్మాళ్, అమ్మస్వామినాథన్, కమలాదాసప్ప. జనరల్ శక్రటరీ: శ్రీమతి ఊర్మిళ మెహతా.

(మిగత వివరములు 52 వ పుటనుండిచూడుడు.)



మహాసభ కనుబంధంగా ఏర్పాటైన వస్తుప్రదర్శనమును బొంబాయి షెరిఫ్ శ్రీమతి మిథాక్‌లాంగారు ప్రారంభోత్సవ మొనర్చినపుడు తీసిన ఛాయాపటము.
రాజకుమారి అమృతకార్, మిథాక్‌లాం, గవర్నరుసతి ప్రభృతులు.



మహాసభాధ్యక్షురాలు శ్రీమతి అనసూయాబాయికాళే ఉపన్యసించుట.
గవర్నరు దంపతు లిరువంకల నాసీనులై యున్నారు.



మహాసభ కేతెంచిన ఇండోనేషియా ప్రతినిధులు.



ఇండోనేషియన్ ప్రతినిధివర్గనాయకురాలు సభవారికి సందేశమిచ్చుచున్నది.

# తామర మొగ్గలు:

శ్రీమతి స్థానాపతి రుక్మిణమ్మగారు





నాగరీకాంత క్రొమ్ముడి నవ్యకుముద
మాలికలు జుట్టి, ధరియించి నీలిచీర
కృష్ణు కౌగిట నుపవని ధృతి గరంగ
తారకానాథు డుదయింప తాపమందె.

దప్పిచే నార్తిచెందిన తరుణి యొకత
గ్రీష్మమందు గంగానది కెలనజేరి
అమృతతుల్యజలమ్ము దా నంజలించి
చూచుచును నిల్చె, త్రాగక చోద్యమేమి ?

రేయి దా బురుషాయిత క్రియల నలసి
దయితు వక్షాన శయనించు దయితురాలి
గరము బాధించె నుత్ఫుల్ల కమలవిపిన
మహిత పరిమళ సంభార మారుతమ్ము.

మదిని కామమున్, క్రోధమున్, మదము, లోభ,
మోహ, మాత్సర్య పంచయమ్ము నివసించి
యుండునో అంత వరకును పండితుండు
పామరుండను భేదమూవంతలేదు.

వీరభటులకు సంగ్రామ వీధియందు
పండిత కవీంద్రులకు కవి మండలాన
కీర్తియేగాని, లేక దుష్కీర్తికాని
నిమిష మాత్రమ్ములో వచ్చు నీలవేణి!

పతికి ననుకూల, మధుర వాక్చతుర, చతుర,
రూపయౌవన సంపూర్ణ, కోపరహిత
సహజ సఖ్యరసాకులాపార హృదయ
యైన మానినీమణి సాటి కానగలదె?

ప్రకృతి మధురాతి మధురమ్ము పార్వణేందు
సత్కళాద్యవలోకనల్ జగతికైన
ప్రియతమాలోకనోత్సవ ప్రీణనత్వ
మస్మదీయాత్మ సాఫల్య మాత్మ సఖియ!

చంద్రు డుదయించుచుండె మహేంద్ర దిఙ్ము
ఖమ్మునందున; ముకుళించె కనులు నళిని,
భ్రమరమా! మధు మధురాశ భ్రమయవలదు;
వ్యర్థమయ్యెను నీ రాక, యరుగు మింక.

మధుకరా! భీతివిడనాడి మదగజేంద్ర
దానవారి ధారారాధ్య తత్పరత ది
రిగెదు తత్కర్ణ తాళమ్ము తగులకుండ
నభినవోన్మేష పద్మిని నాశ్రయింపు.

సకల దిక్కులు నిండు వాసనలతోడ
కనుల కానంద మొనగూర్చు కాంతితోడ
వెలయునో రసాలఫలమ్మ! అలరుదెపుడు
గ్రంధి కుటిలమ్మనగు గుండెకాయ కలిగి.

పూతపరిమళమిళిత మీ కేతకీ సు
మమునే చేరకు తుమ్మెదా! మధువు నీకు
ప్రాప్త మిటకాదు సరికదా, పట్టుధు ళి
కంటకావృత మగును నంగములు కూడ.

రమ్యము చంద్రికా కలితరాత్రులు, పచ్చని నేల పట్టులున్,
రమ్యము సాధు సంగమము, రమ్యము కావ్యము లందుసత్కథల్
రమ్యము కోపబాష్ప ప్రకరత్తరళమ్ము ప్రియా ముఖమ్ములున్,
రమ్యము సర్వః మార్తునకు రమ్యముగాదు జగాన నెద్దియున్.

# ఆతిథ్యము

శ్రీమతి మన్య. కామేశ్వరీదేవిగారు

అది సుప్రభాతము. దినకరుని కిరణజాలములచేఁ బ్రపంచమంతయు సుత్తేజితముగానుండెను. పెద్ద కొండలసమీపమున మధుకుల్యానది తిన్నని నడకలతోఁ బ్రవహించుచుండెను. అరుణకాంతులు నీటిపై ప్రసరించుటవలన నదీగర్భమంతయు కాంతివంతముగానుండెను.

ప్రవంతీ తీరమునకు, గొంచముదూరమున, (గాయకష్టముచేసి) జీవించు కొందఱి కుటీరములుండెను. శ్యామసింగు తనకుటీరద్వారము చెంతఁగూర్చుండి దీర్ఘాలోచనము చేయుచుండెను. అప్పుడు దేశమునఁగఱవు, క్షామ దేవత వేలకొలఁది ప్రజలను తన పొట్టఁబెట్టుకొనెను. ఆహారపదార్థములు చిక్కక శ్యామసింగు కుటుంబము కొన్నిదినము లుపవాస ముండవలసిన దీనస్థితియందుండెను. శ్యామసింగు కుటీరమున యతని భార్య, ముగ్గురుబిడ్డలు; తినతిండిలేక వారందఱు జీవచ్ఛవము లైయుండిరి.

శ్యామసింగు పరుల కష్టములను జూచి యోర్వలేనివాఁడు. తోడిజనులకు సహాయముఁ జేయుటయన్న ముందంజవేయువాఁడు. కుటీరవాసియోచన, నది ఆవలిగట్టువద్దకు వేగముతోఁబరుగెత్తుకొని వచ్చుచున్న యొక అశ్వము గిట్టల చప్పుడువలన భంగమై, అతడావైపునకు దృష్టిసారించెను.

మధుకుల్యానది చాలాలోతు, వెడల్పుగలది. ప్రవాహము మిక్కిలి వేగముగానుండెను. అశ్వము నధిరోహించిన వీరుఁ డుక్కుకవచమును ధరియించియుండెను. అశ్వారూఢుఁడు మిక్కిలి వేగముతో వచ్చి నదియందుదిగెను. గుఱ్ఱముపైనొక సంచికూడాయుండెను. ప్రవాహము తీవ్రముగా నున్నందునను, నదిలోతైనందున, అశ్వమునకు బరువుయెక్కువైనందున, అదిముందునకు నడువలేక మునిగిపోవజొచ్చెను. ఈస్థితిని పరిశీలించి, ఆశ్వికుఁడు గుఱ్ఱమునుండిదిగి, ఆవలిగట్టుచేరుటకై యీదుటకు మొదలిడెను. ప్రవాహము ఒత్తిడివలన యోధుఁ డీదలేక తికమకపడుచు, ఆవలిగట్టు చేరలేకుండెను. అతని శిరస్సు మాత్రము పైకిఁ గనబడుచుండెను. శీఘ్రముగనే అతడు ప్రవాహమునందు కొట్టుకొనిపోవఁజొచ్చెను. ఇతని దురవస్థయంతయు జూచుచున్న శ్యామసింగు బలహీన స్థితియందున్నను ప్రవాహమునందు దుమికి ఎంతో కష్టముతో నాయోధుని గట్టునకుఁజేర్చెను యోధునకు స్పృహలేకుండెను. కుటీరవాసి, యతనికి తగు సపర్యలొనర్చుటవలన కొంతసేపటికి స్పృహగల్గెను. మెల్లగా నేత్రములనుతెఱచి, చెంతనున్న శ్యామసింగును చూచి, అతనికి కృతజ్ఞతా సూచకముగా నమస్కరించెను.

శ్యామసింగునుచూచి ఆశ్వికుడు "సోదరా! నీవు నాప్రాణములను కాపాడితివి. కొంతకాలమువఱకు నేను నీ రక్షణయందుండుటకు యంగీకరించెదవా?" యని యడిగెను. శ్యామసింగు దీనముగా, "యోధుడా! నేను, నాకుటుంబము తినతిండిలేక ఉపవాసముల చేయుచున్నాము ఇటువంటి స్థితిలో నా ఆశ్రయము నీకేమి ఉపయోగ"మనినుడివెను. ఈపలుకులువిని యోధుడు, "నీవుఅధైర్యపడవలదు. నాఅశ్వముగట్టుచేరినది. దానివీపుపై ఆహారపదార్థములుగల యొకసంచిగలదు. అదితీసుకొని నీకుటీరమునకు వెళ్లుదమురమ్ము"నిబల్కెను. అమృతమయమైన ఈ చల్లనివాక్కులనువిని, కుటీరవాసి సంపూర్ణహృదయానందముతో యతనికి సంతోష పూర్వకమైన నమస్కారమునుజేసి, తనకుటీరమునకుఁ దోడ్కొనిపోయెను. చిన్న కుటీరమును ప్రవేశించుట తోడనే, శ్యామసింగుభార్య, ముగ్గురుబిడ్డలు మరణావస్థలో నేలమీద పడియుండుటఁగనబడెను. హృదయము నీరైపోవు ఈదృశ్యమును చూడగానే, ఆశ్వికునకు మిక్కిలిజాలిగల్గెను.

ఆశ్వికుఁడు ఆహారపదార్థముల సంచిని, విప్పిచూడగా అన్నియు దడిసియుండెను. అయితే, ఆ సంచియందు పండ్లరసములుగల కొన్ని సీసాలుండెను. ఆ రసములను త్రాగుటవలన (పాపము!) వారికి కొంత జీవశక్తిగలిగెను. ఎండిపోవు మొలకలకు నీరుపోసి జీవము కొల్పినట్లయ్యెను. వీరిట్లుండగా, నది ఆవలిగట్టున కొంద ఱాశ్వికులు వచ్చుచుండుటఁ గనబడెను. వారు నదిదాటి ఈవలకువచ్చి, శ్యామసింగు కుటీరమున రక్షణపొందుచున్న యోధుని పట్టుకొనవలెనని వచ్చిన ఆశ్వికులు. మధుకుల్యా నదియందు ప్రవాహము వేగముగానున్నందున వారీవలి గట్టుచేరలేక వెడలి పోయిరి.

కుటీరమునకువచ్చి న మరునాడే ఆశ్వికునకు తీవ్రమైన జ్వరమువచ్చెను. కొన్నిదినములకు ఈజ్వరము మిక్కుటమై సందిగ్ధావస్థ గలిగించెను. ఈసమయమున శ్యామసింగు, యతని భార్యయు, యోధుని ఒక్క నిమిషముకూడ నేమరక సపర్యలు చేయుచుండిరి. ఆశ్వికుఁడుతెచ్చిన ఆహారపదార్థములు ముగియుట తోడనే శ్యామసింగు అతనిసంచియందు మరియొకమూటనుగల బంగారునాణెములను వెచ్చమునకు వాడుకొన మొదలిడెను. యోధుఁడు ఆ కుటీరమునకు వచ్చుటవల్ల, శ్యామసింగు కుటుంబము కొంతవఱ కాకలి బాధనుండి కాపాడఁబడెను. కుటీరవాసి వెచ్చమునకు దగినంత డబ్బునుమాత్రము వెచ్చించుచుండెనే గాని, వ్యర్థముగా నొక్క పైసనుకూడ వాడుకొనలేదు. వీరి సపర్యవలన కొంతకాలమునకు ఆశ్వికునకు స్వస్థత చేకూరఁదొడగెను. అప్పుడు కుటీరవాసి యోధునిముందర డబ్బుసంచినుంచి, తనుకర్చుపెట్టినది గాక తక్కిన దాతనికిచ్చెను. ఇంతకాలము యోధుఁడు శ్యామసింగునింట నుండుటవలన్, భార్యాభర్తల యకలంకమైన ప్రవర్తనను తెలుసుకొని సంతసించెను.

త్వరలో యోధుఁడు శ్యామసింగు నాతిథ్యమునుండి మరల పోవలసినదినమువచ్చెను. సంపూర్ణ హృదయానందముతో, చిరునవ్వుమోముతో, యోధుఁడు శ్యామసింగునుచూచి "సోదరా! నేను జబ్బులో నుండగా మీరిద్దరు నాకెంతో సపర్యచేసి ప్రాణములను కాపాడితిరి. నే నీజన్మములో ఈ ఋణమును తీర్పలేను. త్వరలోనే మిమ్ములనువదలిపెట్టి పోవలసినదినము సమీపించినది." అని నుడివెను. శ్యామసింగు చాలాకరుణతో "ఆశ్వికుడా! మేము ఉపవాసములతోనుండగా నీవు మాజీవములను కాపాడితివి. ఈ నీ సహాయమ్ము మఱువరానిది. మనకు వియోగముకలుగుచున్నందులకు చింతిల్లుచున్నా"నని చెప్పెను. యోధుఁడు గంభీరవదనముతో శ్యామసింగుతో "ప్రాణసఖా! నీకు నాకానుకగా ఈరత్నాల ఉంగరమును, కొన్ని బంగారు నాణెము లనిచ్చుచున్నాను, స్వీకరింపుమని" నుడివి, తన వ్రేలనున్న రత్నాల యుంగరమును శ్యామసింగు వ్రేలికి పెట్టి, నాణెములనిచ్చెను. శ్యామసింగు ఉంగరము వైపునకు చూడగానే మహానంద మునుఁబొందెను. ఆ ఉంగరమున రత్నములతో "హుమయూన్ చక్రవర్తి" యని పొదుగబడియుండెను, సంభ్రమముతో భార్యాభర్త లా సార్వభౌమునకు సాష్టాంగనమస్కారమొనర్చి, "ప్రభూ! మేము భారత మహాచక్రవర్తి ప్రాణములను కాపాడినందుకు పరమానందమును బొందుచున్నాము. మీరు మా కుటీరమును పావనము జేసితిరి"అని పలికిరి. చక్రవర్తియు ఆ పుణ్యదంపతులను ఆశీర్వదించెను. వెనుక, శ్యామసింగు, చక్రవర్తి ప్రయాణమునకుగావలసిన సదుపాయములను జేయదొడగెను. 2 గంటలతర్వాత "హుమాయూన్ చక్రవర్తి" తన యశ్వము నధిరోహించి చిరునవ్వుమోముతో శ్యామసింగు కుటీరమునువదలిపోయెను.



# కొన్ని హిందూదేశపు వివాహాచారములు



శ్రీమతి పప్పు సీతమ్మగారు

హిందూదేశపు రాష్ట్రాలలో, పురాతనమునుండి ఆచరణలోనున్న వివాహ సంస్కారలక్షణములు నూతన సాంఘికమార్పులకు కొన్ని రద్దుకాకుండా యీనాటివరకు సుస్థిరముగానున్నవి. అటువంటి నానావిధ వివాహాచారాలలో, కొన్ని పరిశుద్ధము కావలసినవి, ఆశ్చర్యము గొలుపునవి. చదువుటకు ఉత్సాహము కలిగించును.

పంజాబురాష్ట్రపు హిందువులలో, కొన్ని జాతులలో, పెండ్లికుమారుడు పెండ్లికుమార్తె యింటికి తర్లివెళ్లును. ఆసమయమున పెండ్లికుమార్తె గదిద్వారమునకు ఆమెతల్లితండ్రులు ఒక జల్లెడ వ్రేలాడకట్టుదురు. ఆజల్లెడ కెన్ని రంధ్రములుండునో అన్ని లోటుబాట్లు పెండ్లికుమార్తెకుండునని భావమును తెలుపుడు జేయునుగాన, పెండ్లికుమారుడు ఆమెతప్పులను ఒప్పులుగా భావించి ఆమెను అర్ధాంగిగా చేసుకొనమని దానిఅభిప్రాయము. వివాహసమయంలో వెంటాడు భూతబాధ నివారణకోసమున్నూ పెండ్లికుమార్తె లోటుబాట్లు మన్నించినట్లు తెలియపర్చుటకున్నూ పెండ్లికుమారుడు ఒక యినుపఆయుధముతో ఆజల్లెడను చీల్చివేసి, ఆమెను అర్ధాంగిగా చేసుకొనును.

ఇదికాక మరొకవింత ఆచారము అమలులోనుండేది. పెండ్లిసమయంలో, వరునితల్లి, ఇక యింట్లో తనయొక్క అధికారము తొలగునుగదాయన్న విచారముతో నూతిగట్టెక్కి లోనికి కాళ్లు వ్రేలవేసుకుని కూర్చుండును. ఆ సమయమున కుమారుడువచ్చి తల్లి అధికారమునకు లోటుకలుగనీయకుండా చేయుదునని ఖరారుచేయును. పిమ్మట ఆమెనూతిగట్టుదిగివచ్చి కొడుకును వెంటతీసుకొని తర్లివెళ్లును. ప్రస్తుతము ఈవింత ఆచారము విద్యావంతులలో సమసిపోయినది.

అడవిజాతులలో మరొకవింతపద్ధతి అమలులోవున్నది. యువతీయువకులు-కలిసిపండుగలలో, ముఖ్యంగా చైత్రమాసంలో, రాత్రిభాగమంతా నాట్యము చేయుదురు. ఆసమయంలో యువకుడు తనకిష్టమైన యువతిని పట్టుకొనిపారిపోవును. అట్లు రెండు మూడురోజులవరకు వారు యెక్కడోవుందురు. ఇదిరహస్యం కాకపోయినను, జాత్యాచారముగా, ఆయువతీయొక్క తల్లితండ్రులు, యువకుని తల్లితండ్రులవద్దకుబోయి పెండ్లిప్రయత్నములు కట్నములతోసహా చక్కపరచు కొందురు.

వీరిలోని మరోజాతివారు యువతులనందరిని ఆడవిలో నొకగుంపుగానుంచి యువకునిపంపగా అతడు తనకునచ్చిన కన్యను ఎత్తుకపారిపోవును. మిగిలినయువతులు తమలో నొకర్తెను పులియెత్తుకపోయెనని ఒక్కసారిగా కేకలువేయుచూ యిండ్లకుమరలి, అక్కడనున్న మగవారినందరిని వెతుకుటకు ప్రోత్సాహింతురు. వెంటనే వారందరువెళ్లి, జాడకానరాలేదని తిరిగివచ్చి, యువకుని తల్లిదండ్రులవద్దకుబోయి జరిగినకథచెప్పి దోషనివారణకు తగినసొమ్ము చెల్లించి వివాహముస్థిరపరచమని కోరుదురు. అందులకువారు వరకన్యల

అనురాగం తెగకుండా వున్న పక్షమున సొమ్ము చెల్లించుట కభ్యంతరములేదని అంగీకరించి, కార్యము నెరవేర్చుదురు.

" వాల్మీకి " అనేజాతివారిలో (పంచమజాతి), పెండ్లిసమయమున కన్యను తన్నుట కూడా ఒక ఆచారముకలదు. మగపెండ్లివారు ఆడపెండ్లివారింటికి వెళ్లుటతోడనే అతిథులను కూర్చుండబెట్టి, వరునికంఠమునకు ఒకబట్టను (కన్య) చుట్టబెట్టి లోనికియీడ్చి ఒక మూలదాగుండ బెట్టుదురు. పిమ్మట వరకన్యలనిద్దరిని ఒకరిచుట్టూ నొకరిని ఏడుసార్లు చొప్పున త్రిప్పించి ఒకరిశరీరమునకు నొకరితలతాకింతురు. ఆతరువాత వరునిచే కన్య వెనుక భాగమున తన్నింతురు. అక్కడవున్న వారంతా ఈవుత్సవములో పాల్గొందురు. తరువాత కన్య తనశాలువతీసి వరుని మెడచుట్టూ గట్టిగాకట్టగా, వరకన్యలిర్వురూకలిసి పాడుదురు. చివరకు కన్య, వరుని తలపాగవిప్పి అనురాగం తెలియపరుస్తూ తనశాలువకు ముడివేయును.

కొన్ని ప్రాంతాలలో హిందువుడు మూడవసారి పెండ్లిచేసుకొనుట దోషమని దాని నివారణకొరకు ఒక నల్లతుమ్మచెట్టునుగాని, సింధూర వృక్షమునుగాని భార్యగా భావించి, పెండ్లిచేయుదురు. అటుపిమ్మట సక్రమంగా ఒకకన్యను వివాహము చేయుదురు.

ఇంకా కొన్నిప్రాంతాలలో, వరుని ధైర్యసాహసములు పరీక్షచేయుటకూడా ఆచారముకలదు. మగపెండ్లివారు ఆడపెండ్లివారి వీధికివెళ్లేసరికి పడుచులంతా బెత్తములు పట్టుకుని బారులుకట్టి వీధికి యిరుప్రక్కలానుందురు. వరుడు గుఱ్ఱముస్వారి చేస్తుండగా వారంతాకలసి నతనినికొట్టుదురు. అప్పుడు గుఱ్ఱముపరుగెత్తి అతని తలపాగ క్రిందపడిన యెడల అశుభసూచనగా భావింతురు.

వివాహసమయంలో కన్యవున్నగదిలో కొందరుస్త్రీలు, వరునివీపున పిన్నలతో పొడుచుదురు మరికొందరు అతనితలచుట్టూ దారముచుట్టుదురు. ఆసమయమున పెంకి స్త్రీలు పాతచెప్పులుతెచ్చి ఎఱ్ఱనిగుడ్డలోచుట్టి నొకమూలయుంచి ముహూర్తం కాగానే వరునిపిలిచి ఆగుడ్డలోనున్న పవిత్రమైన పుస్తకమును ముద్దుపెట్టుకోమందురు. అట్లుచేసిన యెడల చెప్పులజోడు బయలుచేసి ఎగతాళిచేయుదురు.

కొన్ని పల్లెటూళ్లలో వరకన్యలిద్దరికి కొబ్బరి కాయనిచ్చి కొబ్బరినమిలించి ఆపిప్పిని ఒకరిముఖముపై నొకరిని ఉమ్మివేయమందురు. సిగ్గుపడి వరుడుఉమ్మలేనియెడల అందరు స్త్రీలుకలసి చుట్టూకూడి అతనిని తన్నెదరు.

కొండజాతివారిలో మూర్ఖులుకొందరు, ప్రథమపుత్రిక వివాహసమయమున, కన్య తల్లికుడిచేతి మూడునాలుగు వేళ్లగుంపును కంసాలిచే తెగగొట్టింతురు. వివాహసమయముకు కన్యతల్లి చనిపోయినయెడల యీదుర్ఘటనకు వరునితల్లి పాల్గొనవలెను.

మరికొందరు పెండ్లిసమయమున కన్యను పవిత్రురాలుగా చేయుటకు చక్రాంకితములను మతగురువులచే వేయింతురు. అటుపైని వరకన్యలకు గురువుగారిచేత చెరియొక కొబ్బరికాయ యిప్పింతురు. (ఆంగ్లమునుండి)

# సోమ పాట — పీఠిక

శ్రీ వంగోలు వెంకటరంగయ్య పంతులుగారు బి. ఎ. బి. ఎల్.



ఈ సోమపాటకు సోమతీగెపాటయనియు పేరుగలదు. సోమతీగ యగ్నిష్టోమాదులలో నుపయోగ పడు నొకతీగె. దీని ప్రశంస వేదమునందు గలదు. ఇది స్వర్గమునుండి భూలోకమునకు తీసికొనిరాబడినదని గాథగలదు. ఇది ఈ కాలమున హిమవత్ప్రాంతములలో దొరకునేమోగాని సాధారణముగ లభించునది కాదు. ఈ కాలమున నీ దేశమున ప్రవర్తింపబడు యజ్ఞయాగాదుల దీనికిబదులు "పూతిక" యను తీగె నుపయోగ పరచెదరు.

"సోమ సంభవ యట సుదతి పూతికము"

అని ఈ పాటయందేకలదు. శబ్దరత్నాకరమున సోమమునకు తిప్పతీగె పర్యాయపదముగ చెప్పబడియున్నది. తిప్పతీగెయగునో కాదో బహుశ్రుతులగు శ్రౌతప్రయోక్తలు నిర్ణయింపనర్హులగుదురు.

ఈ పాటయొక ద్విపదరూపమునను్నది. దీని రచియించినది యెవరో యొక బ్రాహ్మణస్త్రీ యని తెలియుచున్నది. పాట కడపట సామాన్యముగ గద్యభాగమున కవులు తమపేరు దెలుపువాడుక కలదుగాని యిందు ఈ కవయిత్రియేలకో తనపేరును దెలుపలేదు. తనతండ్రిగారిపేరు నందేల సుబ్రహ్మణ్యయజ్వయని మాత్రము చెప్పినది. "నందేల" వారు ములికినాటి బ్రాహ్మణులలో ప్రసిద్ధమగు వైదిక పండితకుటుంబము వారని తెలియుచున్నది. ఈ నందేల కుటుంబములోని మరియొక సీతారామశాస్త్రులవారి కుమారిత శేషమ్మ యనునామె ఆడువారు శుభప్రయోజనములలో పాడుకొను పాటల ననేకము రచియించినటులున్నది. దంపతులు ఔపాసనాగ్నికార్యములు జేసికొనుపట్ల నెల్లూరుప్రాంతములలో బ్రాహ్మణ ముత్తైదువులు ఈ శేషమ్మగారు జెప్పిన "శోభాన" ఆరతిపాటలు పాడుచుందురు. ఆ పాటల మకుటమున ఆమె తండ్రిగారిపేరును ఆమెపేరునుగలవు.

ఈ సోమపాటను రచియించిన కవయిత్రికాలము స్పష్టముగ తెలియలేదు. పూర్వము కడపజిల్లాలోని రాయచోటి పుల్లంపేట సిద్ధవటము బద్వేలిలోనగు కొన్నితాలూకాలు మట్లవారి సంస్థానములోనివై యుండినవి. ఆ ప్రాంతములకు "రాజువారిసీమ" యనుపేరు ప్రచురమైయున్నది. ఈ పాటలో నొకచోట

"ఇట్లట్లు వర్ణింప నెవ్వని వశము
మట్ల వెంకటరామ మహీపతి సోము"

అను ప్రశంసముగలదు. దీని నవ్వడినిబట్టి కవయిత్రి మట్ల వెంకటరామరాజు రాజువారిసీమనేలిన కాలమున వర్ధిల్లియుండునని యూహించుట కవకాశమగుచున్నది. అయితే వెంకటరామమహీపతు లీవంశావళియం దిద్దరుగలరు. ఒకరు క్రీస్తుశకము 1608 ప్రాంతముల నా సంస్థానము నేలినవారుగను రెండవవారు క్రీ. శ. పదునెనిమిదవ శతాబ్దమధ్యమున రాజ్యముజేసినవారుగను కడప డిస్ట్రిక్టు మాన్యువలు అను గ్రంథమువలన తెలియవచ్చుచున్నది. ఈ కవయిత్రి బహుశః రెండవవారి సమకాలీనురాలుగనుండును.

ఇక నీయమగారి గ్రామము ఇప్పటి రాజంపేటతాలూకా కిచమాంబాపురాగ్రహారమని ఈపాటవలన తెలియుచున్నది. (ఈ గ్రామమున కిప్పటిపేరు అత్తిరాలయని కొందరు చెప్పెదరు.) అది కాపలకా

(ఏలేశ్వరు) నదీతీరముననున్నది. అది "స్వర్గాపవర్గములకు" మార్గమై యుండినదని కవయిత్రి వర్ణించి యున్నది. మఱియు నచటి విప్రవరులు "ఇందు శేఖరులని యెన్నికకెక్కిన"వారనియు

"ప్రశమంబుతో వారు పాలింపుచుంద్రు
దశమి యేకాదశీ ద్వాదశీ వ్రతము" అనియు

"మసల కెప్పుడు వేదమంత్ర ఘోషములు
వసుమతీసురులిండ్ల వెలయుచునుండు" ననియు

"ఎల్లకాలంబుల నిష్టి పశువులు
కొల్లగా సోమాయాగములును యుండు" ననియు

వర్ణించినది. అట్టి యగ్రహారమున నిపుడొక్క బ్రాహ్మణ కాపురమయిన లేదట!

ఈ ద్విపదయందు అగ్నిష్టోమయాగమున సంకల్పశాలాప్రవేశములు మొదలు అవభృథమువరకు జరుగు చర్యలన్నియు చక్కగ వర్ణింపబడియున్నవి. ఈ యజ్ఞమున సోమాభిషవము అను ప్రయోగముజరుగునపుడు బ్రాహ్మణ ముత్తైదువు లీ పాట పాడుచు సోమలతను (దాని కీ కాలపు ప్రత్యామ్నాయముగు పూతికను) దంచుదురు. ఈ విషయమును కవయిత్రి యిటుల వర్ణించియున్నది:—

"గోరింట చేతుల కొమ్మలందరము
* * *
ముత్తైదువులు మనము ముదము మీరగను
ఎత్తిపాడుచు దంచ నేర్పడుదము

సువ్వి సురగణాఢ్య సువ్విసువ్వనగ
సువ్వి సవనత్రయ సురపూజనీయ"—ఇత్యాది

ఈ కాలమున నీ పాటనేర్చిన ముత్తైదువు లభావమగుచున్నందున ఋత్విక్కులే పూతికమును దంచుకొనుచు వచ్చియు రానియట్లీపాటను చెప్పుటకలదు.

సోమయాగప్రక్రియ అంతయు నీపాటయందున్నటుల కనుపడుచున్నందునను పాటయు సొంపుగ నున్నందునను దీని పూర్ణప్రతి సంపాదించి యచ్చొత్తించవలయునను తలంపుతో ఎందరెందరికో జాబుల వ్రాసినందు కనేకులు ప్రత్యుత్తరములనైన నీయలేదు. కిచమాంబాపురమునకు సమీపముననుండు రాజుపేట లోని హైస్కూలు హెడ్డుమేష్టరుగారు శ్రీ పరమాత్మని సీతారామయ్యపంతులు బి. ఏ. యల్టి గారికిని వ్రాసి యొకప్రతి సంపాదించి పంపమనికోరగా వారు తే 6-2-47 దిన రాజంపేటనుండి దయచేసిన ఇంగ్లీషు జబాబులో నిట్లువ్రాసిరి:—"రాజంపేటయందుగాని ఆ ప్రాంతములగాని కిచమాంబాపురమునగాని సోమ పాట పేరైనవినినవారొక్కరులేరని తెలుపుటకు చింతగనున్నది" అని! వంగోలులోనుండిన కీర్తిశేషులు వంగోలు వేంకటరంగ సోమయాజులవారి కుమారుడు చిరంజీవి ఆయుష్మంతుడు వంగోలు ముని సుబ్రహ్మణ్యముగారు బి. ఏ. పాకయాజి ఒకప్రతియు, నెల్లూరుజిల్లా పంటలల్లూరు వాస్తవ్యులు సుప్రసిద్ధశ్రౌత

పారంపర్యముగల బ్రహ్మశ్రీ వేదము నారాయణ సోమయాజులవా రొకప్రతియు, నెల్లూరిలోయుండిన కీర్తిశేషులు బ్రహ్మశ్రీ కొట్రా రామలింగదీక్షితులవారి కుమారు లొకప్రతియు, నెల్లూరుతాలూకా జేజేపేట వాస్తవ్యులు ప్రసిద్ధశ్రౌతప్రయోక్తలు కీర్తిశేషులు బ్రహ్మశ్రీ దుర్భా కృష్ణయశ్రౌతులుగా రొకప్రతియు దయచేసినిచ్చిరి. వీనిలో నొకటిగాని సమగ్రముగలేదు. అన్నిటిలోనను గ్రంథపాతములు మెండుగనున్నవి. తప్పులు లెక్కకు మిక్కిలిగనున్నవి. తప్పులసవరించియు లుప్తభాగముల బూర్తిజేసియు ప్రకటింపబూనుట దుస్సాధ్యముగనుండుట యటుండ కవయిత్రి సంకల్పించిన పదములస్థానె మన కైతంజొప్పించుట అవినీతమును అసమంజసమును అగును గనుక ఆప్రయత్నమునుబూనక లభించిన ప్రతులలో యుక్తమయిన భాగమును యుక్తమనితోచిన పాఠములతో ప్రచురింప సాహసముజేయబడినది. నేను వేదాధ్యయనము జేసినవాడనుగాను- ప్రయోక్తనుగాను- లౌకిక సామాన్యుడను. కొలదిగ గ్రంథపరిచయమువలనను వినికిడివలనను ఈ ద్విపదములోని కొన్నిపదముల తాత్పర్యము కొలదిగ గ్రహించి అట్టి పదములకు లఘువివృతి నిందు చేర్చితిని. ఈ లఘువివృతిని సిద్ధపరచుటలో కాశిలో క్రీ. శ. 1887 ప్రాంతముల ప్రకటింపబడిన బోధాయన శ్రౌతసూత్రానుసారియగు శ్రౌతపదార్థ నిర్వచనం" అను సంస్కృతగ్రంథమును. (శ్రీ సోమాన నాగేశ్వర శాస్త్రి విరచితం) (E. J Lazarus & Co., Medical Hall Press, Benares) మద్రాసు రివిన్యూబోర్డులో లాండు రివిన్యూ సెక్రెటెరిగానుండిన రావుబహదర్. వి. కే. రామానుజాచార్యులవారివలన నరవమున వ్రాయబడిన "శ్రౌతం" అను గ్రంథమును (జనార్దన ప్రింటింగ్ వర్క్సు, కుంభఘోణం.) అత్యంతోపయోగములుగ నుండినవి. తెలుగున నిట్టిపుస్తక మొకటియైన లేకుండుట గొప్ప కొదువగయున్నది. ఇవిగాక తైత్తిరీయ సంహితయు విద్యారణ్యభాష్యము లోనగునవి చాల సహాయకరములుగనుండినవి.

ఈ ద్విపద నిందు ప్రకటించుటలో గ్రంథపాతములని యూహింపబడినచోట్ల * * * ఇట్లు నక్షత్ర చిహ్నములు చూపబడినవి. గ్రంథపాతము లనుకొనుటకు కారణమేమన ద్విపదకావ్యమున జతలుజతలుగ రెండేసిపాదములకు ప్రాసమేర్పడియుండును. అట్టి ప్రాసభంగము కలిగినచోట్ల కొన్నిబంతులు పోయి యుండును అని యూహ చేయబడినది.

ద్విపదకు గణనియమమును యతినియమమునుగలవు. పాదమునకు మూడింద్రగణములపై నొక సూర్యగణముండవలయును. ప్రాయికముగ మూడవగణముయొక్క మొదటి యక్షరమె లేక ప్రాసయతియైన మూడవ గణముయొక్క రెండవయక్షరమె యతిస్థానము. ఈ నియమభంగ మనేకపాదములందు కనుపించుచున్నది. గణనియమమునకుగూడ భంగపాట్లనేకములున్నవి. వీనినెల్ల సరియొత్తుట సులభసాధ్యము కాదు. అందుచే యున్నదున్నటుల ముద్రింపబడనున్నది. సంపూర్ణమును నిర్దుష్టమునునగు ప్రతిగల పుణ్యాత్ములెవరైన దాని నెరవుగ దయచేతురేని గొప్ప ఉపకారము జేసినవారగుదురు.

[ఈ సోమపాట—వచ్చే మాసమునుండి క్రమముగా ప్రకటింపబడును. గృ॥సం॥]



# నా చిన్ననాటి ముచ్చట్లు

— కే. యన్. కేసరి —

నా బాల్యస్నేహితులగు శ్రీ చెన్న కేశవులు శెట్టిగారి స్నేహము

★—o—o—o—★—o—o—o—★

ఈ శెట్టిగారి తండ్రి అన్నం వెంకటవరదయ్యశెట్టిగారు. వీరు మద్రాసులో పేరు పొందిన వైశ్యులలో గొప్పధనికులు; పేరుప్రతిష్టలుగలవారు. వీరికి దత్తపుత్రులు ఈ చెన్న కేశవులుశెట్టిగారు. వీరినిగురించి యింతకుముందు ప్రస్తావించితిగాని మరల వీరిని స్మరించు చున్నాను. వీరు శివశంకరపాండ్యాగారిస్కూలులో నాకు స్నేహితులయినారు. ఇరువురము ఒకేక్లాసులో చదువుచుంటిమి. నేను వారితోకూడ వారియింటిలోనేయుండి చదువుకొను చుంటిని. ఇరువురముజోడుగుఱ్ఱాలబండిమీద బడికిపోవుచుంటిమి. వారికిఆకాలమున జోడు తెల్ల గుఱ్ఱములుండెడివి. వాటిని పెగుపోనీలందురు. మద్రాసులోనుండు వారందరిని ఆ గుఱ్ఱములు ఆకర్షింపచేయుచుండెను. ఇప్పుడు గిడ్డంగివీధి (Varada Muthiappan Street) మొదటి యిల్లును ఆ ప్రక్కనయుండు వక్కలంగళ్లన్నియును వీరివే. ఇంక ననేకయిండ్లు, తోటలు నుండెను. వీరియింటిలో అపూర్వములయిన నవరత్నములుండెడివి. శెట్టిగారి చెవుజంపులో చిన్నపచ్చయుండెను. దానిని టాకరు కంపెనివారు రు 15000 లు యిచ్చి కొనుక్కొని పోయిరి. ఆ కాలమున టాకరు కంపెనీవారు గొప్ప నగలవర్తకులు. వారును యిప్పుడు లేరు. చెన్న కేశవులుశెట్టిగారి తండ్రిచనిపోయెను. తండ్రి చనిపోయినపిమ్మట కొడుకు వ్యాపారములో చాలనష్టముగల్గి ఆస్తినంతయు త్వరలోపోగొట్టుకొని ఇబ్బందిపడుచుండెను. ఈ సమయమున నా స్థితి బాగుండినందున కొద్దిగ నేను సహాయముచేయుచుంటిని. ఒకనాడు శెట్టిగారికి డబ్బుకావలసివచ్చి వారు వాడుకొను వెండికంచములు చెంబులు వగైరాలు నావద్ద కుదువబెట్టి డబ్బుతీసుకొనిపోయిరి. అట్టి మహాభోగము లనుభవించిన లక్ష్మీ పుత్రునకు యీనాడుయిట్టి కష్టములు కల్గినందులకు నేను చాలవ్యసనపడితిని. నాకు వారు చేసినసహాయములన్నిటిని స్మరించితిని. వారింటపెరిగినసంగతిని స్మరించితిని. కొంతకాలమైన పిమ్మట వారికుటుంబమునంతను మాయింటికి భోజనమునకుబిలిచి విందుచేసి వారు నావద్ద కుదువపెట్టిన వెండిసామానులన్నిటిని వారికిచ్చి నమస్కరించితిని. అప్పుడు నా మనసునకు

కల్గిన ఆనందమునకు మితిలేకపోయెను. కొంతకాలము గడచినపిమ్మట శెట్టిగారిభార్య మాయింటికివచ్చి 'నాబిడ్డకు పెండ్లిచేసుకుంటాను; నాకు యేమైన సహాయమునుచేయు'మని అడిగెను. అప్పుడు నాహృదయము నీరైనది. ఆ మహాలక్ష్మి పెండ్లికి నేను పెత్తనమును చేసితిని. పెండ్లినాడు ఆమెధరించిన ఆభరణములు కొన్నిలక్షల విలువగల్గియుండును. ఆమె ఒడ్డుపొడుగుకలిగిన భారీఃమనిషి. మంచిరూపవతి. నలుగురిబిడ్డలతల్లి. ఆమెయెదుట పెరిగిన వాడనగుటచే కంటనీరుకార్చితిని. నాకుతోచిన ధనసహాయమును చేసిపంపితిని. ఈయమ్మ పుట్టిల్లు నాగపట్నం-అప్పుడప్పుడు శెట్టిగారితోకూడ నాగపట్నంపోయి వీరింటిలోయుంటిని. చెన్నకేశవులుశెట్టిగారి కుమార్తెను పుదుచ్చేరిలోయుండు కల్వ సుబ్బాయ శెట్టిగారి పుత్రున కిచ్చి వివాహముచేసిరి. ఈకారణమువల్ల నేను పలుమారుపుదుచ్చేరికిపోయి వారితోకూడ విందులనారగించుచుంటిని. ఆకుమార్తె బిడ్డనుకని చనిపోయెను. వీరికి శ్రీరంగము ఉత్తర వీధిలో యొక మంచిసత్రముండెను. దానికి ఏకాదశీసత్రమనిపేరు. ఏకాదశినాడు బ్రాహ్మణులకు యిక్కడ ఫలహారములను పంచిపెట్టుచుండిరి. నేను శెట్టిగారితోకూడ ప్రతివైకుంఠ యేకాదశికి శ్రీరంగముపోయి సత్రములోబసచేసి శ్రీరంగనాథస్వామి దర్శనమును చేయుచుంటిని. ఇది నాకును శెట్టిగారికిని కలిగిన స్నేహము.



## బెంగుళూరు పరిచయము

బెంగుళూరులోమొదట కేసరికుటీరం బ్రాంచియుండెను. పిమ్మట అక్కడ సి. జి. శాస్త్రియనువారికి యేజన్సీయిచ్చితిని. వీరుమొదట చిక్‌పేటలో ఒకచిల్లరఅంగడిని పెట్టుకొనియుండిరి. వీరిఅంగడిలోకూడ మామందులను విక్రయించుచుండిరి. వీరుమామందులను అతిసమర్థతతో అమ్ముటచూచి నా బ్రాంచిఆఫీసును తీసివేసి శాస్త్రిగారికి మైసూరు స్టేటుకంతకును సోల్ యేజన్సీనిచ్చితిని. నా యేజన్సీని వారుతీసుకొని శ్రద్ధతో స్టేటంతయు తిరుగుచు ప్రతిచోటునను మందులకు మంచి డిమాండునుకలుగచేసి మంచివ్యాపారమును నాకు చూపించిరి. ఈ ప్రకారము కొంతకాలము మందులవ్యాపారమునుచేసి ద్రవ్యమును సంపాదించి పెద్దహోటలును స్థాపించిరి. క్రమముగ మరిరెండు హోటల్సును స్థాపించిరి. బెంగుళూరు చిక్‌పేటలోయుండు శాస్త్రిహోటలు వీరిది. హైగ్రౌండులోయుండు బృందావనముహోటలు వీరిది. అమెరికన్ కాలనీలోయుండు ఇంగ్లీషుహోటలు వీరిది. ఈవ్యాపారములో శాస్త్రిగారు లక్షలాదులుగడించి పేరుప్రతిష్టలతో సుఖముగనున్నారు.

వీరిపరిచయమువలన నేను ప్రతివేసవికాలమునకు బెంగుళూరువెళ్లుచుంటిని. క్రమముగ

నేను బసవనిగుడివీధిలో ఒక పెద్దతోటగలబంగళానుతీసి దానినీ అనేకవిధములుగ పెంచితిని. ఆతోటనుక్రమముగ పుష్పవనముగమార్చి ప్రతిసంవత్సరము ఆయూరిలో సర్కారుతరుఫున జరుగుతోటల పోటీపరీక్షలలో పాల్గొనుచు నాతోటకు మంచిబహుమానములను ప్రతియేటాపొందుచుంటిని. ఇక్కడమందులఫ్యాక్టరీని పెట్టి మైసూరురాజ్యమునకంత మందునుపంపుచుంటిని (ఈ తోటవివరములు గతసంచికలో వ్రాసియుంటిని.) అక్కడయుండుటవలన మైసూరుతో పరిచయముగలవాడనై పట్టాభిషేకమునకు రాజుగారివివాహమునకు మంచి బహుమతులను పొందగలిగితిని. ఈ యుద్ధములో బెంగుళూరు నాయింటికి మంచిధర వచ్చినందున విక్రయించితిని. నాయిల్లు విక్రయించినపిమ్మట నేను బెంగుళూరుకుపోయినప్పుడెల్లను శాస్త్రిగారింటనే బసచేయుచున్నాను. శాస్త్రిగారు యిటీవల మంచియిల్లును విశ్వేశ్వరపురమునకట్టించిరి. వీరుయిప్పుడు మంచిధనికులయినను కేసరికుటీరమును మరిచిపోకుండ ఏజంటుగానే యిప్పటికిని పనిచేయుచున్నారు. ఆంధ్రులు బెంగుళూరుపోయినప్పుడు శాస్త్రిగారిహోటలులోనే బసచేసెదరు. వీరుఆంధ్రులు. ములికినాటివారు. తెలుగువారికికావలసినపచ్చళ్లు ఆవకాయ మొదలగునవి వీరిహోటలులో వడ్డించెదరు.



## బెజవాడ ఏజన్సీ

కేసరికుటీరమునకు బెజవాడలో ఏజంటు శ్రీ భీమశంకరరావుగారు. వీరి కంపెనీపేరు శీతారామజనరల్‌స్టోర్సు. వీరికి మొదట కేసరికుటీరము ఏజన్సీనియిచ్చునపుడు వీరివ్యాపారము చిన్నదిగనుండెను. మాయేజన్సీ చేతచిక్కినపిమ్మట క్రమముగ వారివ్యాపారముకూడ వృద్ధి అయినది. ఆంధ్రదేశమునకంత సోల్‌యేజంటుఅయినారు. సికింద్రాబాదులో కేసరికుటీరము బ్రాంచినిపెట్టినారు. అటుపిమ్మట అరవదేశమునకంతటికిని యేజన్సీతీసుకొని మధురలో బ్రాంచినిపెట్టినారు. ఇటీవలనే బరంపురంలోకూడ బ్రాంచినిపెట్టి సమర్థతతో పనిచేయుచున్నారు. ఆంధ్రదేశమునకంతటను మందులను సప్లైచేయునిమిత్తము రెండుసంవత్సరముల క్రితము బెజవాడలో గవర్నరుపేటయందు ఫ్యాక్టరీని స్థాపించినాను. ఇక్కడనుండియూ హైద్రాబాదు, బరంపురం బ్రాంచీలకు మందులు రవాణాఅగుచున్నవి. భీమశంకరరావుగారు వ్యాపారరహస్యములను తెలిసినవారు. మంచిస్నేహపాత్రులు. చాలపెద్దమనిషి.

## మద్రాసులోని విశేషములు



మావూరిప్రాంతములనుండి అప్పుడప్పుడు కొందరు ముక్కోటిఏకాదశికి, శ్రీరంగమునకును రామేశ్వరయాత్రకునుపోవుచు మద్రాసులో నన్ను కలుసుకునేవారు. వార్లకు నేను పిట్టి త్యాగరాయశెట్టిగారి భవనమును, ఇనుపవారధి (Harbour), కోట, మన్రోదొరబొమ్మ, చచ్చినకాలేజి (Museum) రాణితోటలోయుండు పులులు, సింహములు లైట్‌హౌసు (Light house) హైకోర్టు వగైరాలను చూపించుచుండెడివాడను.



## మద్రాసు సోమారులు

మద్రాసులో ముందు సోమరివారు అనునొక జట్టుయుండెడిది. పనిలేనివారు, పోకిరివారు, తలిదండ్రులులేనివారు, ఇండ్లనుండి వెళ్లగొట్టబడినవార్లు వీరందరు యీ సోమరి జట్టులో చేరుచుండిరి. మద్రాసులో పెండ్లిపేరంటములు జరుగు యిండ్లకుపోయి పుల్లాకుల (ఎంగిలాకులు)లోని అన్నాదులను తినుచుందురు. వారి వాకిటి ముందర గుంపుగచేరి డబ్బు యిచ్చువరకు కేకలువేయుచుందురు. రాత్రిళ్లు యిండ్లపంచలలోను మూసివేసిన అంగళ్ల ముందరను పండుకొనెదరు. పట్టణంకోమట్లకు వీరినిచూచిన భయము. కోమట్లు వీర్లకు నెల జీతములిచ్చి తమ యిండ్లముందరను రాత్రిళ్లు పండుకొనునట్లు యేర్పాటుచేసుకొనెదరు. ఈసోమర్లు పెండ్లిపూరేగింపులకు దివిటీలనుపట్టెదరు. వెదురుబద్దలతోను రంగుకాకితములతోను 20 అడుగుల పొడవుకల్గిన రాజు, రాణి బొమ్మలను భీకరాకారముగ తయారుచేసి పూరేగింపుల ముందరపోవుచుందురు. విరోధులుగనుండువారిని కొట్టుటకు డబ్బిచ్చినచో వార్లను చావకొట్టివచ్చెదరు. వీరలు కల్లుసారాయిని త్రాగకపోయినను గుంపులుగుంపులుగచేరి గంజాయిని త్రాగుచుందురు. వీర్లలో స్త్రీలుకూడగలరు. ఈ తెగ పురుషులందరు మొదటిప్రపంచయుద్ధములో ఖర్చుఅయినారు. ఇప్పుడువారు మద్రాసులో కనుబడుటలేదు. ఇక ఆనాటి గొప్పవ్యక్తులగు కొందరినిగూర్చి తెలిపెదను.



## మందపాటి రామకృష్ణయ్యగారు

ఆ కాలమున బ్రాహ్మణులలో ప్రసిద్ధికెక్కిన భాగ్యవంతుడు ధర్మాత్ముడు మందపాటి రామకృష్ణయ్యగారు. వీరికి మద్రాసులో అనేక కట్టడములుండెడివి. అమంజికరైలో ఒక

వుద్యానవనమును అందులో దివ్యమైన భవనముండెడివి. అప్పుడప్పుడు ఆ తోటకు స్నేహితులతో కూడవచ్చి కేళీవిలాసాదులతో కాలముగడుపుచుండేవారు. వీరు కీ॥ శే॥ విజయనగరం మహారాజా ఆనందగజపతివారికి స్నేహితులు. రాజకళతో నొప్పు వీరు శ్రీ మహారాజావారి సరసనకూర్చుండి, జోడుగుర్రాలబండిలో తిరువత్తియూరు దేవాలయమునకు వెళ్లునపుడు చూడముచ్చటైన దారిపొడవున జనమువిరుగబడి చూచేవారట. వీరిభార్యగారు ఏడువారములసొమ్ములు, అతివిలువగలవి, ధరించేవారట. వీరికి స్నేహితులు జాస్తికాగా, వారికుండిన ధనాదులు హరించిపోయినవి.



## Tauker & Sons (టాకర్ అండ్ సన్స్)

ఆ కాలమున ఏకామ్రేశ్వర అగ్రహారములో ప్రసిద్ధపురుషుడగు రంగనాథటాకరుగారు గొప్పనగలవ్యాపారమునుచేయుచుండిరి. వీరు గుజరాతి బ్రాహ్మణులు. మొదట తనయింటిలోనే యీ వ్యాపారమును ప్రారంభించి కొడుకులు పెద్దవారై ప్రయోజకులు కాగానే మౌంటురోడ్డులో T.R. Tauker & sons అను పేరుతో గొప్పభవనమును నిర్మించిరి. అక్కడ బంగారు, వెండి, సామానులను నవరత్నములలో పొదగబడిన వివిధ ఆభరణాదులనుతయారుచేసి యిప్పుడుండుP. R. & Sonsషాపుకంటె హెచ్చుగమంచి వ్యాపారమునుచేయుచుండిరి. వీరికిముఖ్యకాతాదారులు రాజులు, మహారాజులు, జమీందారులు, లక్షాధికార్లు. ఈ కాతాదార్లు మద్రాసుకువచ్చినప్పుడు వీరు నివసించుటకు టాకరుగార్డన్ యను గొప్పబంగళాను నిర్మించిరి. మద్రాసుకువచ్చినరాజులు ఆ భవనమున కొంతకాలము బసచేసిపోవునపుడు యీ టాకరుకంపెనీవారువార్లకు అమూల్యములగు కొన్ని ఆభరణములను విక్రయించెదరు. ఆభరణములకు వెల కంపెనీవారు నిర్ణయించినదే. ఈప్రకారము వారు కొన్ని సంవత్సరములు కోట్లకొలది వ్యాపారమునుచేసి కడపట కంపెనీని మూయవలసివచ్చినది. ఈ టాకరుగార్డను యీ మధ్యనే రెండున్నరలక్షలకు వేలములో విక్రయమైనది.



## మోసస్ కంపెనీ (Moses Co)

ఈ కంపెనీ మౌంటురోడ్డులోయుండెను. వీరురాజులకు మహారాజులకును కావలసిన స్టేటు డ్రస్సులను (State dresses) వెలగల యితర వుడుపులనుకుట్టి వారికి సప్లైచేయు

చుండెడివారు. ఈకంపెనీకి స్వంతదార్లు వైశ్యులలో పేరుపొందిన మోసస్‌కంపెనీ శీతారామ శెట్టిగారు. ఈకంపెనీవారు రాజులకు వుడుపులనుకుట్టి లక్షలాదులుసంపాదించిరి. టాకరు కంపెనీవారు ఆభరణములను మోసస్‌కంపెనీవారు ఉడుపులను రాజులకుసప్లైచేసి 'పేరు ప్రతిష్టలుగడించిరి. కొంతకాలమునకుపిమ్మట వీరును షాపుతలుపును మూసిరి.



## డాక్టరు వరదప్ప నాయుడు

డాక్టరు వరదప్పగారిది బ్రహ్మసమాజపు మతము. సుమారు 6 అడుగుల ఎత్తున ఒడ్డూపొడవుగల భారీమనిషి. పెద్దగడ్డమునుగలవారు. బర్మాయుద్ధములో పనిచేసినవారు. వీరు ముఖ్యముగ ప్రసవములచికిత్సలకు పేరుపొందినవారుగనుండినను అన్నివ్యాధులను సమర్థతతో వైద్యముచేయుచుండిరి. చనిపోయిన డాక్టరు రంగాచారికి యుండిన ధర్మబుద్ధి ఆ కాలమున వరదప్పగారికియుండెను. పేదవార్లను దయతో చూచి ధర్మముగ చికిత్సను చేయుచుండెను. ఇంటికివచ్చినప్పుడు డబ్బిచ్చిన (Visiting fee) వారు పేదవారని తోచిన ఆ డబ్బును వారికి మరలయిచ్చి రోగికి పాలకు గంజికి ఖర్చుపెట్టమనేవారు. విద్యార్థులకు సహాయముచేయుచుండువారు. దాత; దయాపరుడు. వారుస్థాపించిన అనాధశరణాలయము యిప్పుడు తిరువత్తియూరు హైరోడ్డులోయున్నది. వీరివైద్యశాల ఆల్‌బట్ & కంపెనీ (Allbut & Co) మొదట బ్రాడ్‌వేలోయుండెను. ఇప్పుడది మౌంటురోడ్డులోయున్నది.



## డాక్టరు హాలరు

ఆకాలమున హాలరు డాక్టరుగూడ ముఖ్యముగ కోమట్లలో చాలపరిచయము పలుకుబడిగలిగియుండెడివారు. వారు ఆంగ్లోయిండియన్‌లు. చాలపొట్టిగ సన్నగయుండిరి. మంచి డాక్టరనిపేరు. ఇంటికివచ్చిన రు 2 లు ఫీజు. 10 నిమిషములు రోగివద్దయుండి చిట్టికథలను చెప్పి రోగినినవ్వించును. అతనికి యొక పాతబ్రూహాంబండి, ముసలిగుఱ్ఱమువుండెడిది. ఆబండి మనిషినడకకంటె అధికముగపోజాలదు. ఆ బండిలోకూర్చుని వారుయెప్పుడును యేదో వ్రాసుకొనుచుండువారు. మద్రాసులో సోడాతయారుచేసి విక్రయించినవారిలో వీరే మొదటివారు. హాలరుసోడా యనిన యిప్పటి స్పెన్సరుసోడావలె పేరు పొందినది. వీరు వరదప్పనాయుడంత ధర్మబుద్ధిగలవారుకారు. వారి షాపు యిప్పటికిని బ్రాడ్‌వేలోయున్నది గాని వారుచనిపోయి చాలకాలమైనది.



# హృదయనివేదన

శ్రీమతి చింతామణిభట్ల పద్మావతీదేవిగారు.

మురళీధరా! బాలగోపాలకా! కృష్ణా!
ఇచ్ఛాప్రసక్తితో ఊగాడు మనముతో
వేగలేనోయి నే నోపలేనోయీ ॥ ము ॥

యమునానదీ సలిలధారయే మధురమో?
నా నిశ్చలంబైన హృదయమే మధురమో?
చవిచూడ రావోయి యదుబాలకా! ॥ ము ॥

నిక్కమౌ ప్రేమతో గాసిల్లె నా ఎడద
ఆలసించితివేని ఆహ్లాదమే లేదు!
అర్పింప నీవోయి లక్ష్మీధవా! ॥ ము ॥

సంకల్పమాత్రాన సృష్టించు సిద్ధుఁడవు,
నీ సృష్టిలోని మాధుర్య మింకుచునుండె
నీ సృష్టిలోజీవి అన్యాయ పథగామి,
నీదు ఆదర్శముల మఱచె జీవాత్మ
జీవాత్మ - పరమాత్మ సంబంధమేమో
జీవమే లేని కట్టెగనయ్యె జీవి!
కల్పాంతమనుకొంటివా? వటపత్ర శాయివై పవళింతువా?॥ము॥




ఉత్తరేణు:—సర్వవిష సంహార మూలికయని పేరొందినది. సామాన్యమయిన కుక్కలు, పిచ్చికుక్కలు, పాములు, విషజంతువులు కరచినప్పుడు విషమెక్కి ఉద్రేక రూపములు దాల్చకుండుటకు ఆకు, ఆకురసము, సమూలము కషాయమువాడుట మంచిది.

దంతపరిశుభ్రతకు ప్రాధాన్యమయినది గనుకనే 'ఉత్తమము ఉత్తరేణు' యని చెప్పుచుందుము.

ఉత్తరేణు సమూలము దంచి నూనెలోవేసి కాచి దింపి వడియగట్టి జాగ్రత్తపరచి ఆనూనెను చెవులలో హోరుమని శబ్దముకల్గినప్పుడు, క్వాయినా వాడుటవలన చెవులలో దిబ్బెళ్లు, మాటవినబడకుండుట మొదలగు దుర్లక్షణములు పోవును.

వెలగపండు:—సర్వసామాన్యముగ అడవులలో పెరుగును. అడవిజాతివారలకు బ్రతుకు తెరువును కల్పించగలనౌషధి. పండ్లను, కాయలను సామీప్యములోనున్న బస్తీగ్రామములకు కొనివచ్చి విక్రయించుకొని వారలకు కావలసినవస్తువులు కొనుక్కొని అడవులకు పోయి జీవించుచుందురు. మరియు దారిమార్గస్తులు, యాత్రీకులు, అరణ్యమార్గములలో ప్రయాణముచేయుతరి అలసిన బాటసారులకు ఆహారముగాను రుచికరముగాను ఉండి ప్రయాణ ప్రయాసలను లేకుండజేయుటకే యిట్టిపండును విధాతసృష్టించెను.

పండు మంచివాసన నిచ్చును. నాశికారంధ్రముల ఆవాసనబోవగానే తినవలెనని అపేక్ష జనించును. పండును బ్రద్దలుగచేసి చేతిలోపెట్టుకొనకముందే నోరు ఉవ్విళ్ళూరును. యెప్పుడెప్పుడాయని అభిరుచి కలుగును. ఆగుజ్జును భుజించుతరి పులుపు, తీపి, చాలినంత మెదుపుకలిగియుండుటచే యెట్టి ఇతరపదార్థముల చేరికయుకూడ ఆశించదు. ఆరోగ్య వైద్యరీత్యా ఎముకపుష్టికి, పిత్తము నణచుటకు, శక్తినిచ్చుటకు ముఖ్యములగు పదార్థములు- పొటాష్, లయిం - (సున్నం) ఇనుము అనునవి మూడును యిమిడియున్నవి.

ఇట్టిపండ్లు శక్తిహీనులు, రక్తహీనులు, పాండురోగులు, పిత్తప్రకోప, పైత్యతత్వము గలవారలు తినిన అత్యంత ఉపయోగకరము.

గర్భిణిస్త్రీలు—వేవిళ్లుఅని అనుకొను సమయములలో పుచ్చుకొనిన పండ్లవంటి పుత్రికా పుత్రులను గాంచెదరు. మరి యితరపదార్థములమీద ఆశయున్నను ఆరోగ్య ప్రాధాన్యమయి యున్నదిగాన తప్పక దీనిని భుజించవలయును.

నీళ్లవిరేచనములకు, బంకవిరేచనములకు (రక్తమలముతో కూడినవాటికిసహా) వెలగపండులోని గుజ్జు 5 తు, చల్లనినీళ్లు 10 తు, పంచదార్ర 5 తులములు కలిపి వడయకట్టి దానిని రోజుకు మూడుపర్యాయములు తడవకు రెండుస్పూనుల ప్రకారము యిచ్చిన నీళ్లవిరేచనములు, నీరసము, పాలిపోవుట నెమ్మదించును.

వెలగపండు షర్బత్

4 వెలగపండ్లలోని గుజ్జు, వేడినీళ్లు—1 కుండెడు వెడలాటి పాత్రలోయుంచి కల్పి; చల్లారినపిదప పంచదారచేర్చి ప్రతిమూడుగంటలకు వకఔన్సుచొప్పున యిచ్చిన చిరకాలము నుండివున్న విరేచనములు, నొప్పితోకూడిన విరేచనములు నెమ్మదించును.

వీటిలో లవంగపుపట్టయు కూడ చేర్చవచ్చును.

ఆకలిలేకపోవుట, మందగించుట, నీరసము, శక్తిహీనత మొదలగువానికి పనికి వచ్చును.

వెలగచెట్టు, గులకరాళ్లు, తేమ యిమిడియుండు నేలయందు పెరుగును. చాలా ఎత్తున కాయలుకాయుటచే సూర్యరశ్మికి పరిపక్వమయినందున — గుణాధిక్యమయి యుండును.

చిన్నపిల్లలకు సుద్ద (తెల్పు) సామాన్యముగ మూత్రములో కల్సిపోవుచుండుట, కండ్లు తెల్లబడుట మొదలగులక్షణములు కనుపించుట జరిగినప్పుడు బిడ్డలకు యేవిధము గనో వారికి యిచ్చిన సులభముగ నెమ్మదించును.

మధుమేహముగలవారికి పంచదార కూడనప్పుడు, వాడకూడదని తెల్సుకొని నప్పుడు, వెలగపండును నిప్పులకుమ్ములోపెట్టి కొంతసేపువుంచి తర్వాతతీసి పెంకుపీడిన తర్వాత తియ్యనిపెరుగులోగాని, చిక్కనిమజ్జిగలోగానివేసి మెత్తగ కలియపిసికి కొంచెము కారము ఉప్పువేసి కరివేపాకువేయుచూ మసలా తిరుగమాత తాలింపు వేయవలయును.

వెలగపండుపెంకును యెండబెట్టి చూర్ణించి లోపలకుయిచ్చిన సర్వవిషములు నశించును.








### —: రేగుపండ్ల పచ్చడి:—

రేగుపండ్లనుదెచ్చి రోటిలోవేసి చితకకొట్టిన అందుండువిత్తులు వేరగును. ఆవిత్తులను వేరుచేసి, మిగిలినతోలు, గుజ్జుకుతగిన పచ్చిమిరపకాయలు ఉప్పువేసి కలియత్రొక్కి కడపట కొత్తిమెరాకునువేసి నూరి వాడవలయును. రేగటిచేలలో నేలప్రాకు రేగుచెట్లపండ్లు చాలచిన్నవిగనుండును. పెద్దవిగానుండునవి కండరేగుపండ్లు. రేగుపండ్లతో అడలుచేసి ఉంచుకొని వాడుకొనెదరు. (అడలుఅనగా ఉప్పు, మిరపపండ్లు వేసి గింజ నలగత్రొక్కి, బిళ్లలుచేసి ఎండబెట్టబడినవి.) ఇవి నిలవఉండును. ఎండాకాలమున దంతశుద్ధికై నోటిలోవేసుకోగానే నోటద్రవమూరును. నానపెట్టి పచ్చడిచేసుకుందురు.

### —:ధనియాలపచ్చడి (కొత్తిమిర్లు):—

ధనియాలను, మిరపకాయలను నూనెలోవేయించి కొద్దిగ చింతపండును తగుమైనఉప్పునువేసి, నీళ్లనుచల్లి పచ్చడిగానూరవలయును. ఇంటికివచ్చిన చుట్టాలు ఎన్నాళ్లకు వదలివెళ్లనిచో నిరాదరణ సూచనగా 'ఇక దయచేయుండి'అన్నట్లు— ఈ పచ్చడినిచేసి వడ్డించేవారట పూర్వము యుక్తిశాలినులైన గృహలక్ష్ములు!

### —:కొత్తిమెరాకు పచ్చడి:—

బాగాపెరిగిన కొత్తిమెరాకునుదెచ్చి సన్నముక్కలుగ నఱికి, నీడను ఆరబెట్టవలయును. నూనెలో మిరపకాయలువేసి పక్వముగవేగినపిమ్మట, ఉద్దుపప్పును కొద్దిగవేసి, కమ్మనివాసన వచ్చినపిమ్మటతీసి రోటిలోవేసి పొడిగొట్టి, తగుఉప్పును కొద్దిగచింతపండునువేసి కలియత్రొక్కి కొత్తిమిరాకును, ఆముద్దలోవేసి త్రొక్కిన, కొత్తిమిరాకుతడివలన పచ్చడిముద్దయగును. దీనిని కొద్దిదినములవరకు వాడుకొనవచ్చును. కొత్తిమిరాకును తడిఆరువరకు ఆరనిచ్చి, త్రొక్కిన పొడియగును. ఇట్లుచేసిన నిల్వయుండును.

### —:పచ్చికరివేపాకు పచ్చడి:—

లేతకరివేపాకుదెచ్చి యీనెలను దూసి పెట్టుకొనవలయును. ఎండుమిరపకాయలను వేయించుకొని, ఉప్పు, చింతపండునుచేర్చి బాగుగానూరి, కడపట కరివేపాకునువేసి నీళ్లనుచల్లి ముద్దగనూరవలయును.

### —:పచ్చికాకరకాయ పచ్చడి:—

పచ్చిపెద్దకాకరకాయలను కుమ్ములోపెట్టి, కాయలనుకడిగి, వంకాయపచ్చడి మాదిరిగనూరవలయును.

## —:పండుకాకరకాయ పచ్చడి:—

పండిన పెద్దకాకరకాయలను పెద్దముక్కలుగ కోసి, బాణలిలో కొద్దిగానూనె వేసి ఆముక్కలను అందులోవేసి కొద్దిగ వేయించి పెట్టుకొనవలయును. పిమ్మట వేయించిన మిరపకాయలను రోటిలోపొడిచేసి, కావలసిన చింతపండును గుజ్జుగకలుపుకొని మిరపకాయలపొడిలోపోసి తగినఉప్పువేసి, కాకరముక్కలను కలిపి కలియత్రొక్కి పెట్టుకొనవలయును. పిమ్మట బాణలిని పొయ్యిమీద పెట్టి నూనెబాగాపోసి, కాగిన పిమ్మట తుంచినమిరపకాయలు, మెంతులు, ఆవాలువేసి, వేగినపిమ్మట ఉల్లిగడ్డలముక్కలను కూడవేసి వేయించవలయును. ఉల్లిగడ్డలు వేగినపిమ్మట, పైనూరిపెట్టుకొనిన కాకరముక్కలను యిందులోవేసి కొద్దిగ పసుపు, బెల్లమునుచేర్చి నిదానముగ, సన్ననిసెగపై లేహపక్వముగునట్లు వేయించుకొనిభుజించిన చాలరుచిగానుండును. కొందరు పండుకాకరకాయలను, పండుమిరపకాయలనుకలిపి త్రొక్కి (ఉప్పుతోచేర్చి) నూనె తిరగపోతలోవేసి వేయించి—అన్నములో కలుపుకొనితిందురు. దీనిని పండుకాకరకాయ కారము అందురు.

## —: బండపచ్ఛళ్లు :—

'బండపచ్ఛళ్లు' అనగా సాధకాలు యేమిలేనప్పుడు, అవసరముగ చద్దిఅన్నముభుజించి బయట పోవువారికి, బడికిపోవువారికి తయారుచేసి వాడుకొను పచ్ఛళ్లు.

ఉప్పు, మిరపకాయలు, ఉల్లిగడ్డ, చింతపండు చేర్చినూరిగాని,—పచ్చిమిరపకాయలు, చింతపండు, ఉప్పు, కొతిమిరాకును చేర్చినూరిగాని—పచ్చి ముడిపెసలు, మిరపకాయలు, ఉప్పు, యింగువచేర్చినూరిగాని —మిరపకాయ, వుప్పుమాత్రము నూరిన గొడ్డుకారముగాని—వాడెదరు.

# బ్రతుకుతెరువు

నేటి ఆహారసమస్యను పురస్కరించుకొని మన దేశపు ఉష్ణప్రకృతికి త్వరగాచెడిపోవుకాయగూరలు, పండుఫలములు—మరికొంతకాలము నిలువయుంచి ఆహారముగా ఉపయోగించు పద్ధతులను కొన్నిటిని చెప్పదలంచి—గతసంచికలో—మామిడివరుగు, మామిడితాటిథాండ్ర, మామిడిటెంకపప్పు అనువానినిగూర్చి చెప్పితిమి. ఇందు మామిడిపండ్లుమున్నగు పండ్లను నిలువయుంచుపద్ధతి నొకదానిని చెప్పుదుము.

## మామిడిపండ్లనిలువ

| | | |
|---|---|---|
| బాగుగాచెక్కుదీసి తరిగిన మామిడిపండుముక్కలు | 2 | పౌనులు |
| పంచదార .... .... .... .... .... | 2 | ,, |
| నీళ్లు .... .... .... .... .... .... .... | 2 | ,, |

ముందు పంచదార నీళ్లలోకలిపి పొయ్యిమీదపెట్టవలయును. అది పాకము పదునుకు రాబోవునప్పుడు ఆ ద్రవములో మునుగునట్లుగా మామిడిపండుముక్కలనువదలి బాగుగామంటబెట్టి దానిని ఉడకనివ్వవలెను. అట్లు అరగంటసేపువరకు ఉడకనిచ్చి ముక్కలుఉడికి మెత్తబడిపంచదారపాకముతో కలిసిపోగానే దించి చల్లబరచి పరిశుభ్రమైనజాడీలోనికిఎత్తి గాలిదూరకుండ మూతపెట్టవలెను. ఇదికొంతకాలము చెడిపోకయుండగలదు. తినుటకును చాల రుచికరముగనుండును.

## అనాసపండ్లనిలువ

అనాసపండ్లనుగూడ నిలువఉంచవచ్చును. అనాసపండ్లనుతెచ్చి బాగాచెక్కుతీసి, సన్నని ముక్కలుగా తరుగవలయును. లోపలకళాయిచేసిన డబ్బాలనుతెచ్చి వానిని వేడినీళ్లలోఉంచి కాచి పరిశుభ్రముచేయవలయును. ఆ కాపువల్ల లోన వేడిగానుండి పొడిగానుండు ఆ డబ్బాలలో ముక్కలనువేసి—దానిపై 25% పంచదారతోకలిపి చిక్కగాకాచబడిన పంచదారపాకమును 25° వేడితోనున్నదానిని ఆ ముక్కలపై మునగపోసి కుదించి 4 నిమిషములుంచి మూతమూయవలెను. అంతట నా డబ్బాలను 25 నిమిషములు మరుగుచున్న వేడినీటిలోయుంచికాచగా లోపలిపదార్థము నిర్దుష్టమగును. ఆ పిదప నా డబ్బాలను చల్లనీళ్లలోయుంచి చల్లపరచి చల్లనిప్రదేశములనుంచి క్రమముగా సేవింపవచ్చును.

## సీమరేగుపండ్లనిలువ

సీమరేగుపండ్లను, దెబ్బతగులనివానిని తెచ్చి చెక్కుతీసి—వానినట్లేముంచవలయును. "విలియం" సీమరేగుపండ్లు ఇందుకుశ్రేష్ఠము. అనాసపండ్లముక్కలనువలెనే

పీనినికూడ పంచదారపాకములోముంచి నిలువయుంచవలయును. ఈ సీమరేగుపండ్లకు వాడుపాకము 20% పంచదారతోకూడుకొన్నదిచాలదు. 40% పంచదారతోకూడుకొన్నదై యుండవలయును.

### జామపండ్లనిలువ

ఇట్లే జామపండ్లనున్నూ 30% పంచదారపాకమును నిలువయుంచనగును. ఇవి అన్నియు ఇండ్లలో తినుటకేగాక—పండ్లుఅయిపోయిన పిదపకాలమున త్వరత్వరగాఅమ్మి లాభముపొందవచ్చుగాన—ఇండ్లలో తీరికచేసుకొని తయారుచేయగల స్త్రీలకిదిమంచి బ్రతుకుతెరువు.

ఈ పండ్లను నిలువయుంచునది పంచదారపాకమే. కావున పాకమున నీటిబుడగలులేకుండ చూచుకోవలెను. డబ్బాలలోగాని, ఇతరపాత్రలోగానివేసి మూతవేసిన మీదట లోపల గాలినిలిచి పదార్థమును పాడుచేయకుండ ఆ పాత్రను వేడినీళ్లలోపెట్టియుంచి ఆ నీళ్లను కొంతకాలముకాచుటమంచిది. అట్లుకాచబడినదానిని చన్నీళ్లలోపెట్టి చల్లారబెట్టవలయును. బొప్పాయి, సీమరేగుమున్నగు గట్టిపండ్లను ముందుగా నీటిలో ఉడకబెట్టి మెత్తబడినపిదప పాకముతోచేర్చుట మంచిది.

# ఇంటిపనులలో మెళకువలు

## ఎదిగే పిల్లల సంరక్షణ

శ్రీమతి సరస్వతి చెన్నకేశవన్‌గారు ఎం. ఏ.

మానసిక శాస్త్రం ప్రకారం, ఎదిగేపిల్లలకు ప్రత్యేక సంరక్షణ వుండవలెను. చంటిపిల్లలు, చాల నిస్సహాయులుగా వుంటారు. కాబట్టి వారిసమస్యలు ఆప్పటికి భోజనము, స్నానము, నిద్ర, వీటిలో అణగిపోతాయి. కానీ, వారు పెరగను, పెరగను, వ్యక్తిత్వము రాను, రాను, తలితండ్రులకు సమస్యలు ఎక్కువ అవుతూవుంటాయి. ఈదశలో వారి సంరక్షణ ఏలా ఉండాలనంటె. వారిని జీవితాంతము మానసికంగాను, సామాజికంగాను, కలిగేటటువంటి సమస్యలను ధైర్యముతోను, సమానదృష్టితోను, ఎదుర్కొని వాటిని జయప్రదంగా నిర్వర్తించుటకు శక్తిమంతులను జేయునదిగా వుండాలి. మనం ఇప్పుడు పాతే విత్తే, రేపు మహావృక్షంగా అయ్యేది! దానికే, వాళ్లకు మంచిఅలవాట్లు, ఇతరులతో కలిసీ, మెలసీ వుండడం నేర్పించాలి.

పిల్లలు పెరిగేటప్పటికి ముఖ్యంగా మూడువిధాలుగా వాళ్లసమస్యలను విభజించవచ్చును. ఆట మూలాన, అంటే, వారితోటిపిల్లలతో కలసేనప్పుడు కలిగే సమస్యలు, బళ్లో, వుపాధ్యాయులవల్లనో, లేక సహాధ్యాయులవల్లనో గలుగు సమస్యలు, అతరువాత ఇంట్లో తల్లిదండ్రులవలన, మరి ఇతరసంఘంవలన కలిగే సమస్యలు. ఈమూడుకూడా మనం ఇలా విభజించామేకానీ, ఒకటిపైన ఇంకొకటి ఆధారపడివుంటాయి. కొన్ని అలవాటులు అభ్యాసాలు ఈమూటిమీద ఆధారపడి వుంటాయి. ఈమూటిలోకూడా ఇంట్లో కలిగే సమస్యలే చాలముఖ్యం అనుకొంటాను. ఇంట్లో తల్లితండ్రులు, లేదా ఇతరపెద్దలు, ఎపుడూ తమకు అండగా వుంటారని పిల్లలకు అభిప్రాయము. చంటిపిల్లపుడు వారికి ఏహానికలుగకుండా కాపాడుటవలన ఈలాటి అభిప్రాయము బాగాకలుగుతుంది. దీనిని ఆధారంగా తీసుకొని పిల్లనడతను మనం దిద్దాలి. చాల మట్టుకు ప్రతీచిన్నవిషయంలో జోక్యం తీసుకొంటూ, "ఇది నీకుమంచిది, ఇదికాదు" అని పిల్లలకు అస్తమానం చెప్పుతూంటే, పిల్లల్లో రెండువిధాలయిన మార్పులు కనిపెట్టవచ్చును. తమ స్వంతబుద్ధి ఉపయోగపరచి ఏపని చేయలేకుండా, ప్రతివిషయానికి, తల్లితండ్రులమాటకు ఎదురుచూడడం, రెండవదేమో, తమ విషయంల్లో వీరు ఎప్పుడు జోక్యం తీసుకొనే కఠినులు కాబట్టి వారి మాటలెప్పుడూ వినరాదు అనిన్నీ భావాలు కలుగుతూ వుంటాయి.

అటువంటప్పుడు ఏంజేయాలి? తెలివిగల తల్లులు, ఏవిధంగా నడచుకుంటే పిల్లలకు మేలో, అల్లా చేయడానికి, వారిలోనే యిష్టము, శ్రద్ధపుట్టించాలి. అంటే, ఒకక్రియ తప్పుఅనకుండా, ఆక్రియకు కారణ భూతమైన భావాన్నిగ్రహించి, అంతకంటే ఆకర్షణీయమైన భావాన్ని వాళ్లకు ప్రదర్శించి, దానిని వాళ్లు యిష్టపడేటట్టు చిత్రించాలి. ఆట్లాంటపుడు, ఇందులో ముఖ్యంగా గమనించవలసినవిషయం,—ఒకచెడ్డ అలవాటును పోగొట్టాలెనంటే, పిల్లలశ్రద్ధ అంతాకూడా, క్రొత్తఅలవాటుమీద త్రిప్పవలయుననేకానీ పాతఅలవాటు నిషేధంలో పెట్టకూడదు.

ఒక వుదాహరణగాం చెప్తాను. చాలమంది పిల్లలు గోళ్లుకొరకడం చూస్తున్నాము. ఈ అభ్యాసాన్ని విమర్శించిచూస్తే నూటికి తొంభైమందికి, ఇంట్లో ఎప్పుడూ తప్పులు కనిపెట్టడంవల్ల, ప్రతిపనీ నిషేధించడం వలన వస్తుందని తెలుస్తుంది. అది ఎట్లావస్తుందంటే ప్రతి చిన్నవిషయంలోనూ నిషేధించడంవల్ల, ఆపిల్లాడికి నరముల స్వాధీనత అంతగావుండదు. ఒకపని చేయునప్పుడు మధ్యలో జోక్యం కలుగజేసుకొని అదితప్పు, ఇదితప్పు అంటుంటే, పెద్దవారికే నరములబలహీనత కలుగుతుందంటే, ఇక పిల్లలవిషయం అనవసరం అటువంటి పరిస్థితులలో, మానవశరీరము, నరముల శాంతికలిగించుటకు ఎన్నో అలవాటులు కలిగించుకొంటుంది. వాటన్నిటిలో, గోళ్లుకొరకడం, వేలు చప్పరించడం ముఖ్యమయినవి. ఈ అలవాట్లు పోగొట్టాలంటే, చెదరిపోయిన ఆనరములశక్తి మరల కేంద్రీకరించేదానికి ఆపిల్లలకు మంచిఅలవాట్లు నేర్పించాలి. అంటే, ఏదో వారికిష్టమయిన ఆటవస్తువులో, లేక బొమ్మల పుస్తకమో, అదీ లేకపోతే,

ఏదైన మంచికథలో చెప్తే, వారు ఆ అలవాటు మరచిపోతారు. చిన్న చిన్న విషయాలే ఎంతపని చేస్తాయో చూశారా!

తరువాత, ఎదిగేపిల్లలకు ఏలాంటిబడి మంచిది అని యోచించాలి. సాధారణంగా పిల్లకీ, పిల్లకీ వ్యక్తిగత వ్యత్యాసాలుంటాయి. కొంతమంది పిల్లలు చాలతెలివిగలవారుంటారు. చెప్పినదంత అప్పటికప్పుడే గ్రహించడము. గ్రహించడమే కాకుండా దానిని క్రియరూపంగా పెట్టడం, ఇవన్నీ మేధావికి గురుతులు. అయితే, 4 లేక 5 సంవత్సరములవరకు ఈ విషయంలో పిల్లల కట్టేతేడా వుండదు. అల్లావున్నా, తమ పిల్లలనుమాత్రము చూస్తూవున్న తల్లితండ్రులు బోధపరచుకోవటం కష్టం. కాబట్టి మొట్టమొదట తల్లితండ్రులు గమనించవలసిన విషయం. అందరిపిల్లలు ఒక్కటిగా విద్యారంగంలో ప్రకాశించరు అనేవిషయం. తరువాతనేమో, పిల్లల్ని ఎదురుగాపెట్టుకొని, "వాళ్లబ్బాయి బాగాచదువుకొంటాడు, వీళ్లబ్బాయి బాగా చదువుతాడు, నీకేమీరాదు" అని ఉదాహరణాలు చూపించరాదు. ఇందులో తప్పేమని ప్రశ్నించవచ్చును. అదేమాటంటే పిల్లాడికి, "మనం ఎందుకూ పనికిరాము, కాకపోతే, మనమీద అంతయిష్టంగా వున్న అమ్మ ఎందుకు ఇలాఅంటుంది" అన్నభావం బాగాదృఢంగా నాటిపోతుంది. ఆతరువాత వారు కొద్ది కొద్దిగా చదువుమీద శ్రద్ధవదులుకొంటారు, లేదా, "మనం ఏంకష్టపడి యేంప్రయోజనం. కాబట్టి ఇక చదువకూడదు" అనే భావమైన, కలుగుతుంది. రెండూచెడువే.

అల్లాఅయితే బళ్లో పదిమందిపిల్లలతోవుంటే ఈ తారతమ్యం తెలియకుండా వుంటుందా అని అడగవచ్చును. అదే మనబళ్లల్లో వచ్చినచిక్కు. మనదేశంలో పిల్లలబుద్ధి మేధాశక్తి, చతురత, కనిపెట్టి వారి వారికి తగిన చదువునేర్పు బళ్లు చాలఅరుదు. ఆలోటు మనం ఇంట్లో తీర్చాలి. పిల్లల మేధాశక్తి బడి పుస్తకాల్లోనే ప్రకాశించదు. కొంతమంది పిల్లలు చదువులో వట్టి మొద్దులుగావున్నా, చేతిపనులు యంత్రపుపనులు చేయుటలో చాలతెలివి గనుబరుస్తారు. అది మనంగ్రహించి, వారికి ఎంతచదువు పుస్తకాలమూలంగ అవశ్యమో దాన్నినేర్పి, తరువాత వాడియిష్టమైనపనులు నేర్పడం మంచిది. ఒకపిల్లాడికి మంచి బొమ్మలు వ్రాయటం వస్తుందనుకోండి, వాడికి చదువుమీద శ్రద్ధతక్కువ. ఎప్పుడూ ఏదో గీసుకొంటూ" వుంటాడు. వాణ్ణి అప్పుడు తిట్టీ, కొట్టీ, బెదిరించక, "తరువాత మంచిబళ్లో డ్రాయింగునేర్పిస్తాను" అని వాడికి నమ్మకంచేస్తే వాడు అప్పటికి పుస్తకములు చదువుకొంటాడు.

కొంతమంది పిల్లలు 'బళ్లో ఇతరపిల్లలు కొడ్తారు, ఎగతాళిచేస్తారు, కాబట్టి నేను బడికిపోను' అంటారు. అల్లాంటప్పుడు తల్లిదండ్రులు బళ్లో ఉపాధ్యాయుల సహాయంతీసుకోవాలి. ఎగతాళి, కొట్టడం, ఇంకా ఇతరమైనబాధలు పిల్లలు కారణంలేకుండా చేయరు. ఆకారణం, చాలమట్టుకు ఉపాధ్యాయులకు తెలిసివుంటుంది. అది కనుక్కొన్నతరువాత ఉపాధ్యాయులు, తల్లితండ్రులు కలిసి దిద్దాలి. సాధారణంగా, పిల్లలు చాడీలు, అబద్ధాలు, చెప్తారు. ప్రతిబాలుడూ, ఇవిచేసినా, మరొకర్లో అదేగుణము చూచారంటే ఓర్చరు. చాలమట్టుకు పిల్లలకు బళ్లోవచ్చేకష్టాలన్నీ ఈగుణంవల్లనే. దానిని పోగొట్టటానికి కొన్నివిధులు ప్రదర్శనానికి అవకాశం కలిగించకుండా వుండటం గురువులపని. ఒక సమయం అల్లాచాడీలుచెప్పినా కనబరచుకోకుండా నటించి, అటువంటి పనివలన తనకు లాభంకలుగదని పిల్లాడికి నచ్చజెప్పడం గురువులవంతు. ఇక యింట్లో, తల్లితండ్రులు, పిల్లలను, తమజతవారితో ఆడుకోమని ప్రోత్సహించడం, అటువంటి ఆటలతో ఏందెబ్బలాటవచ్చినా, వారిని గమనించక వాళ్లతగవలు వాళ్లేతీర్చుకొనుటకు నేర్పిస్తే, వాళ్లకు తోడిపిల్లలతో మెలగడంవస్తుంది. అప్పుడు వారు బళ్లోగలిగే పరిస్థితులనుకూడా ఎదుర్కొని జయప్రదంగా నడిపించగలరు. పిల్లలను, ఆల్లాదెబ్బలాటల్లో వదిలేస్తే వారు చాలప్రమాదాలు తెచ్చిపెట్టుకొంటారేమోనన్న భయముండకూడదు. తనకు దెబ్బతగులుతూంటే ఏపిల్లాడుభరించి వూరుకోడు. అల్లా భరించి వూరుకొన్న పిల్లాడ్ని మిగతపిల్లలు అసలు కొట్టడానికి వెనుకతీస్తారు. పెద్దవాళ్లు ప్రవేశించకుండ వున్నంతవరకు పిల్లలు ఏమీ హానితెచ్చుకోరు. వాళ్లదెబ్బలాటలు వాళ్లేతీర్చుకొన్నారంటే, వారికి స్నేహబంధాలు ఇంకా గట్టిపడుతాయి. నాలుగేళ్లనుంచి ఏడు, లేక ఎనిమిదేళ్లవరకు మరి ఇల్లాజాగ్రత్తతో పెంచితే, పిల్లలు తరువాత జీవితంలో సుఖపడుతారు,

# జనవరి 14 సంక్రాంతినాడు

## అన్ని ముఖ్య కేంద్రాలలో విడుదల

**డి.వి. సుబ్బారావు....పుష్పవల్లి**
**రమణారావు..వరలక్ష్మి,**
**రేలంగి** నటించిన





సాటిలేని మేటినాటకమని కొనియాడబడిన

# వింధ్యరాణి

నిర్మాతలు.. వైజయంతి ఫిలిమ్సు లిమిటెడ్
డైరెక్షన్.. సి.పుల్లయ్య......స్టూడియో..జెమిని..

## జెమినీ రిలీజు

ఆంధ్ర, రాయలసీమ హైదరాబాదులకు సబ్ డిస్ట్రిబ్యూటర్లు:—
చమ్రియా టాకీ డిస్ట్రిబ్యూటర్సు, బెజవాడ.

## గమనించండి.

మేము ప్రచురింప జాలని రచనలు రచయితలకు తిరిగి పంపబడవు. కాబట్టి వృథాగా పోస్టుబిళ్లలు పంపకండి. నకళ్లు వ్రాసి ఉంచుకుని అసలు రచనలంపితే ఉభయత్రా సౌకర్యం.

సంపాదకుడు.

# వేదకాలపునాటి స్త్రీలు





రాజా రంగయ్యప్పారావు బహద్దరు, ఎం.ఎ.,
ఉయ్యూరు కుమారరాజా



## పూర్వపు రోజుల్లో స్త్రీలకు విద్య ఎంతవరకు ఉండేది?

పూర్వకాలంలో ఉన్నతవిద్య అనగా నాలుగు వేదములు చదవడం, వేదాంతము నభ్యసించడము. ఈ విద్య స్త్రీలుకూడా అభ్యసించేవారా లేదా అనేవిషయం పరిశీలించవలసి ఉంటుంది. వేదకాలంలో స్త్రీలకుకూడా పురుషులతో సమానమైన విద్యాభ్యాసపు హక్కుండేదని స్థిరపడుతుంది. ఎందువల్లఅంటే 'స్త్రీ'ఋషులు కూడా పూర్వము వేదములనుగురించి ఉపన్యసిస్తూ ఒకచోటినుండి మరియొకచోటికి పర్యటనచేస్తున్నట్లు తెలుస్తుంది. ఈరోజుల్లో రైలుమార్గాలున్నప్పుడే ఒకచోటినుండి మరియొకచోటికి ప్రయాణముచేయడం ఎంతకష్టమో స్త్రీలకు బాగాతెలుసు. ఆరోజుల్లో మెట్టదారులవెంట, మహారణ్యాలలో నడచి, అడవిజంతువుల వాతపడకుండా, చోరులను తప్పించుకొని, ప్రయాణంచేయడమంటే స్త్రీలకు ఎంతధైర్యం, ఆరోగ్యం, ఔదార్యం ఉండాలో నేను వేరే చెప్పనక్కరలేదు. వేదమంత్ర పఠనేగాక వాటినిగురించి చర్చకూడా చేసేవారు. యజ్ఞయాగాదులుకూడా పౌరోహితులుగా ఉండి చేయించేవారు. గొప్పగొప్ప సంగీత విద్వాంసులు కూడా ఉన్నారు. ఘోష అనేసాధ్వి ఋగ్వేద మంత్రములు బాగాతెలిసిన వ్యక్తి. లోపాముద్ర, మమత, ఉపాల, సూర్య, ఇంద్రాణి, శచీ సర్వరాజ్ఞి, విశ్వావర మొదలయినవారు గొప్ప ప్రాముఖ్యతలోకివచ్చిననారీమణులు. విశ్వావర అగ్నినిగురించిన ఋక్కులకు అర్థం చెప్పటమేగాక ఋత్విక అనగా పురోహితగా పనిచేసింది. రానురాను పౌరోహిత్యము మగవారేకాని స్త్రీలుచేయకూడదని కొంతమంది స్వలాభపరులు శాసించారు. "బ్రహ్మచర్యాశ్రమము" అనగా కేవలము బ్రహ్మచర్యమేగాదు, వేదముచదువుట కూడా స్త్రీలకు నిర్ణయించబడినది. ఉపనయనం కూడా ఉండేది. ఉపనయనం అయినతర్వాతనే విద్యార్థికి చదువు మొదలు. అథర్వవేదములో బాలికలుకూడా బాలురతోపాటు బ్రహ్మచర్యాశ్రమములో ఉన్నట్టుగా తెలుస్తుంది. బాలికలు, బాలురుకూడా ఆచార్యునివద్ద శిక్షపొందుతూ గురుకులంలో ఉండి విద్య నభ్యసించేవారు. రామాయణంలో ఆత్రేయి అనునామె కుశలవులతో వాల్మీకాశ్రమంలో వేదాంతమును అభ్యసించినట్లుగా ఉంది. 'అశ్వాలయన' గృహ్య సూత్రంలో బ్రహ్మచర్యం బాలురకు, బాలికలకు కూడా సమానమే "సమం బ్రహ్మచర్యం" అని చెప్పబడింది. అథర్వవేద సిద్ధాంత ప్రకారంగా బ్రహ్మచర్య పూర్తిఅయితేనేగాని స్త్రీకి వివాహపు హక్కులేదు. దీనినిబట్టి మనకు తెలిసేదేమిటంటే

బాల్య వివాహములు ఎంతమాత్రము వేదసమ్మతములు కావని. యజ్ఞోపవీతం కూడా స్త్రీలు ధరించేవారు. 'నాభిల' గృహ్య సూత్రంలో పౌరోహితుడు బాలికకు శుభ్రమయిన దుస్తులు ధరింపజేసి యజ్ఞోపవీత ధారణం చేయించి, మంత్రోభ్యాసము చేయించాలని చెప్పబడిఉంది. పరాస్కరుడుకూడా స్త్రీలకు ఉపనయనాది కర్మకాండలున్నాయనీ, వేదములు చదవాలని చెప్పాడు. కొంతమంది స్త్రీలకు వేదమంత్ర పఠనకు హక్కులేదు- అంటున్నారు. కాని సూత్రముల్లో యజ్ఞములు మొదలైన మతసంబంధమైన కర్మలప్పుడు స్త్రీలనుకూడా మంత్రపఠన చేయమని, ఆజ్ఞాపించబడింది. స్త్రీలకు మంత్రపఠన హక్కులేకపోతే ఇలా ఎందుకు చెప్పబడుతుంది. స్త్రీలు ఒక్క వేదాంతమే కాదు, ఇతర విద్యలుకూడా నేర్చుకున్నట్టుగా ఉంది. ఆపస్తంబుడు "స్త్రీకున్న విజ్ఞానం అన్ని విద్యలను పూర్తి చేయునటువంటిది" అని చెప్పాడు. ఆపస్తంబ సూత్రములలో స్త్రీలకు "ఆచార్య" అనే పదం ఉపయోగింపబడింది. "ఆచార్య" అంటే వేదఋక్కులు అన్వయంచేయగలవాడు అని అర్థము. కాబట్టి "ఆచార్య" శబ్దం స్త్రీపరం అయినప్పుడు స్త్రీ గురువని మనం అన్వయం చేసుకోవచ్చు. ఆర్యులకు విద్యావిషయాల్లో స్త్రీపురుష భేదంఏమీలేదు. అందుకనే విద్యకు అధిదేవత పేరు "సరస్వతి" అన్నారు. ఏ సారస్వతుడో అని ఎందుకనగూడదు. స్త్రీలకే విద్య పనికిరాకపోయినట్లయితే విద్యఅంతకు ముఖ్యస్థానం స్త్రీకి ఎందుకుండాలి? ఇంతకంటే వేరే ప్రబలనిదర్శనం అక్కరలేదు. ఉపనిషత్కాలపు స్త్రీలస్థితి పరిశీలించినట్లయితే మనకు ఆనందము కలుగకమానదు. పెద్దపెద్ద సభలలో కూడా స్త్రీలు పాల్గొన్నట్లు తెలుస్తుంది. ఒకసమయంలో జనకమహారాజు మహావిద్వాంసుల సభ ఒకటి ఏర్పాటుచేశాడు. ఆ సభలోకి వెయ్యిఆవులను కొమ్ముల్లో బంగారంపెట్టి తెప్పించి వచ్చినవారి అందరలో మహావిద్వాంసుడు ఈ ఆవులను తోలుకొని వెళ్లవచ్చునని చెప్పాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. యాజ్ఞవల్క్యుడు తనశిష్యులతో ఆవులను తోలుకెళ్లమని చెప్పాడు. ఇంతలో జనకమహారాజుగారి పౌరోహితుడు 'నీవేనా ఏమిటి తెలివిగలవాడివి. ఇంకెవ్వరూ లేరా?' అన్నాడు. అంటే యాజ్ఞవల్క్యుడు "మహాపండితులయెదుట నేను తలఎత్తలేను. ఆవులనుమాత్రం నేను తీసుకొంటాను," అన్నాడు. అంటే తెలివిగలవాడు ఎవడైన ఉన్నట్లయితే పరీక్షించుమని ఆపై ఎనిమిదిమంది పండితులు ప్రశ్నలు అడిగారు. వారినందరిని సమాధానపరచి మాట్లాడకుండా చేశాడు. అందులో 'శార్జి' అనే స్త్రీకూడా ఉంది. యాజ్ఞవల్క్యుణ్ణి రెండుసార్లు ప్రశ్నించింది. శార్జికూడా వయస్సులోనూ, విజ్ఞానంలోనూ యాజ్ఞవల్క్యునితో సమానమైనజోడీ. శార్జి ఇంకను అనేకప్రశ్నలు వేయగా చివరకు యాజ్ఞవల్క్యుడు "ఓశార్జి! ఇంక ఎక్కువ ప్రశ్నలు నన్ను అడుగవద్దు" అన్నాడు. అప్పుడు అడుగుటమానివేసింది. ఉపనిషత్తులకాలంలో ఇంకొక బ్రహ్మవాదిని మైత్రేయి. ఈమె యాజ్ఞవల్క్యునిభార్య. యాజ్ఞవల్క్యునికి ఇద్దరుభార్యలు. మైత్రేయి, కాత్యాయిని. మైత్రేయి విద్యావ్యాసంగముతో కాలము గడుపుతూఉండేది. యాజ్ఞవల్క్యునికి వానప్రస్థాశ్రమ కాలము సమీపించగా ఇద్దరుభార్యలకు ఆస్తినిపంచదలచి మైత్రేయిని నీకేమికావలెనని అడుగగా ఈ మహాప్రపంచమంత నాకు సంక్రమించినను దానివలన మోక్షమువచ్చునా అని యాజ్ఞవల్క్యుని ప్రశ్నించెను. యాజ్ఞవల్క్యుడు డబ్బునకు మోక్షమునకు సంబంధములేదని చెప్పినమీదట మోక్షప్రాప్తికి మార్గమేదియని ఆమె మహర్షినిఅడిగెను. దీనినిబట్టి ఆమె విజ్ఞానసంపత్తి మనకందరకు తేటతెల్లమవుతుంది.

పురాణకాలంలోకూడా స్త్రీవిద్య విరివిగా ఉన్నట్లగానే కనిపిస్తుంది. రామాయణంలో కౌసల్య వేదశాస్త్రములందు ప్రజ్ఞానవంతురాలయినట్లుగా కనిపిస్తుంది. 'సులభ' అనే ఆమె జనకమహారాజుతో తన వృత్తాంతమును చెపుతూ ఆమె జీవితమంతయు వేదములు ఉపనిషత్తులు మొదలగు మహాగ్రంథములు చదువుటకు ఉపయోగించినట్లున్ను అందువల్ల వివాహము కూడా మానివేసినట్లున్నూ చెప్పింది. అంటే స్త్రీవివాహం చేసుకోకుండా సారస్వత సేవయో దేశసేవయో చేసినట్లయితే ఇప్పటిలాగ పెండ్లిచేసికోలేదని ప్రపంచమంత నిందపాలుచేసేవారు కాదన్నమాట. మహాభారతంలోకూడ ద్రౌపదినిగురించి "పండిత" అనేశబ్దం ఉపయోగించబడింది. ఆమెచిన్నతనంలో ఒక మహర్షివద్ద విద్యాభ్యాసంచేసినట్లుగా తెలుస్తుంది. బాల్యవివాహాలు ఎప్పుడు వచ్చాయో విద్యాభ్యాసం అడుగంటింది. ధర్మశాస్త్రాల కాలంవచ్చేటప్పటికే స్త్రీలగతి అధోగతిపాలయింది. దానితోపాటు దేశస్థితికూడా క్షీణించింది. స్త్రీలు క్షీణించితే సంఘముమాత్రం క్షీణించకుండా వుంటుందా! మనుస్మృతిలో ఎక్కడా బ్రహ్మచారిణీ అనే పదమే కనబడదు. స్త్రీలకు విద్యపోయింది. ఉపనయనంపోయింది. యజ్ఞయాగాది కర్మలుచేసే హక్కుపోయింది. ఇవన్నీ స్త్రీలకుగాను వారిభర్తలచే చేయబడేవి. మనుధర్మస్మృతిలో స్త్రీకి పెండ్లే, ఉపనయనం, విద్యాప్రారంభం; భర్తకు ఉపచారంచేయడమే ఆశ్రమవాసం; గృహకృత్యాలే సంధ్యావందనం అగ్నిహోత్రం అని చెప్పాడు. బాలికకు తప్పక తలిదండ్రులు వివాహంచేసితీరాలి. వివాహం చేసేముందు, విద్య ఉన్నదాలేదాఅనేప్రశ్న అక్కరలేదు. తక్షశిల, నలంద విద్యాలయములలోకూడా బాలికలున్నట్లుగా ఎక్కడాకాన్పించదు. ఉపనిషత్తుల కాలంలోని 'స్త్రీ' ఋషులు పూర్తిగా నశించిపోయారు. మెగస్థనీసు మాత్రం స్త్రీలుకూడా వేదాంతము చదువుతున్నట్లు సన్యాసాశ్రమం స్వీకరించినట్లు చెప్పాడు.

ఇప్పుడు మళ్లీ స్త్రీవిద్య స్త్రీల స్వాతంత్ర్యము, స్త్రీలహక్కులు అన్నీకూడా పూర్వంవలె మాత్రమేగాక మగవారితో సమానంగా రాబోతున్నాయి. కాని స్త్రీలకు హక్కులు వస్తేనేమాత్రం చాలదు. హక్కులతోపాటు స్త్రీలు కొన్నికొన్ని భారాలు వహించవలసివస్తుంది. దీనికి స్త్రీలు బాగా విద్యావతులయి, డాక్టర్లు, లాయర్లు, ఇంజనీర్లు, హైకోర్టుజడ్జీలు కావాలి. అంతేగాక అందరు ఆరోగ్యవతులయిఉండాలి. అప్పుడుగాని మనదేశంలో ముస్ముందు పుట్టబోయేవారు బలవంతులయి ఆరోగ్యవంతులయిఉండరు. మనదేశానికి స్వాతంత్ర్యంవచ్చింది. ఇప్పటి స్త్రీలు రష్యాలోని నారీమణులులాగ యుద్ధంలోకూడా పాల్గొనాలి. విద్యాసంస్థలు ప్రతిఊళ్లోఉండాలి. అచ్చటికి స్త్రీలువచ్చి విద్యనభ్యసించాలి. అప్పుడుగాని, విద్యాభివృద్ధి మనదేశంలో విరివిగాజరుగదు. స్త్రీలు విద్యావంతులయితే వారిపుత్రులను, పుత్రికలను, ప్రజ్ఞావంతులుగాచేస్తారు. శివాజీతల్లి శివాజీకి చిన్నప్పటినుంచి రామాయణకథ మహాభారతకథచెప్పి దేశాన్నిరక్షించే మహానుభావుణ్ణిగా తయారుచేసింది. అట్లా మీరందరు మీ పుత్రులను తయారుచెయ్యాలి. అప్పుడే భారతమాతకు ధన్యత సిద్ధిస్తుంది.

—సమాప్తం.



# కాఫీ దేవత

శ్రీమతి బుర్రా కమలాదేవిగారు

మొక్కగఁదోఁచి భూస్థలిని ముద్దుగ మ్రానయి తద్దఁ బెర్గుచుం
జక్కఁగఁబూలు దాల్చివరుసన్ గొలలెత్తి ఫలప్రదాయివై
మిక్కిలి బీజసంతతిని మించి ప్రపంచము నిండు కాఫి! నీ
వెక్కడఁబుట్టితో జనుల యెక్కువ కాకరంబవై?

గొప్పకు భోగులు ముందుగ
రప్పించి నినున్ వినోదరసనా రుచికిం
జొప్పించిరి; యదిమొదలుగ
ముప్పిరిగొని యెల్లవారిముంపవె కాఫీ?

ప్రకటముగాఁగ నీమహిమ పట్టణవీథులఁ బ్రాకిప్రాకి చా
లకమటఁ బల్లెలందును బలత్వముఁజెంది క్రమక్రమంబుగా
సకల గృహాంతరంబులను సంతత వాసముఁగొన్న కాఫి! నీ
చకచకలేమి చెప్పనగు సత్వమహత్వము లెట్టివోకదా?

భోగులఁ బురిఁడిరిగెడు బై
రాగులు శిశువృద్ధ జనులు రామామణులున్
రోగులు విధవాంగనలున్
యోగులు నీసేవఁదృప్తి, నొందరె? కాఫీ!

నినుద్వేషించుచు నప్పుడేపొగడి యెంతే సంతతామోదులై
జనముల్ నిన్నెడబాయకుండెదరు నీ సారస్యసత్సౌరభం
బునకున్ దాసులుగాఁగ; నెట్టిజననంబుం గాంచినావో ధరన్
వినుతింపందగు నీమహామహిమ కాఫీ! పుణ్యసంభారమా!

నీవింటిలోపల నిండుగాఁగల్గిన దారిద్ర్యబాధను దలఁపకుంద్రు;
నిన్నండుగా నింటనెలకొల్పుకొని పయిన్ బంధుమర్యాదఁ గాపాడుకొంద్రు;
పెండ్లిండ్లు పొసగింప బెద్దలే తేరఁగా నినుఁజూపి యున్నతిం దెలుపుకొంద్రు;
తప్పని యుపవాస మప్పుడైనను దేహధారకంబుగ నిన్నుఁ గోరుచుంద్రు;
నినుగుఱించి వలయుధనమింత నెలకని యెంతవారలైన నెంచుచుంద్రు
నీవులేకయున్న నెఱవేర్చుకోఁజాల రెట్టి పనిని నెవ్వరేని కాఫీ!



నిన్నమ్ముకొనెడు వారల
పున్నెం ఒదియేమొ కాని పోషింతువు నీ;
వెన్నఁగ నినుసేవించెడు
నన్నరులను బాధపెట్టి యలతువు కాఫీ!

అందఱి నోళులఁబడనీ
వెందుకు కడువేగివేగి యెఱుకున గుండై
పొందెదు శ్రమమును నీతోఁ
జెందిన వారికిని ముప్పుచెనకఁగఁ గాఫీ!

అమ్మవారవౌచు నఖిల జనంబుల
గృహము లందుఁదాపురించినావు;
నినుభరింప లేము; నినుఁ ద్రోయగాలేము;
దండమిదియె నీకుఁదల్లి! కాఫీ!

కూడియుఁ గూడని పల్కుల
నాడితి నిన్నంచు నలుకనందకుమెదలో
వేడెక్కియున్న నీచవి
పోడిమి చూడంగ మనసు పుట్టెను కాఫీ!

# ముసలమ్మకట్ట

శ్రీ మడకశిరా కృష్ణమూర్తిగారు

[అనంతపురమందలి బుక్కరాయసముద్రమనే చెఱువుగట్టు. సమయము సాయంత్రము. మూడుదినములుగా, ఆకాశము చిల్లులుపడినట్లు మున్నుమిన్ను ఏకధారగా "భో"రని వర్షముకురిసినందున ఆ చెఱువు నిండి ప్రచండరూపము దాల్చినది. కట్టతెగుటకుసిద్ధమైనది. నోళ్లువడకుచుండ, చలికాగలేక, శరీరమునశక్తి చాలక ప్రజలు గట్టుదగ్గర కనిపెట్టుకొనియున్నారు. ఆవూరిపెద్దరెడ్డి-వీరారెడ్డి, తనభటుడు వెంకన్నతో ప్రజలముందఱ నిలబడియున్నాడు.]

వీరారెడ్డి:—ఒరే వెంకన్నా!

వెంకన్న:—..................

వీరా:—వెంకడా! నీకు చెవుడా యేమి?

వెంక:—రెడ్డిగారూ, వాన ఎంతగందరగోళమండీ, చెవులుమూసేసినాయి!

వీరా:—గట్టుతెగినదా, కొంపమునిగినట్లే! ఏదేవతకోపమో మనపైపడింది! కాకున్న ఎప్పుడు లేనివర్షము ఈ యేడుమాత్రము కుండలతో క్రుమ్మరించుట ఎందుకు?

వెం:—ప్రభూ! నిరుడు పోలేరమ్మకు పొంగలి దించాలని వేడినాముకదండీ? తాము సిద్ధగించలేదు!

వీరా:—ఆ. తెలిసింది. అమ్మవారికి కోపమువచ్చింది. మనపై చింతనిప్పులు గ్రక్కుతూంది (చేతులు మోడ్చి) తల్లీ! రేపుతప్పక నీకు పొంగలిచేయిస్తాము! అమ్మా! మేము నీ కన్నబిడ్డలు-మమ్ము రక్షించవే. ఇవిగో పదివేలనమస్కారాలు! ఒరే వెంకడూ, అందఱికిచెప్పరోయి, రేపు ఈ చెఱువుదగ్గర అమ్మవారికి బలులు, పొంగలి చేయించవలెనని. మనము ఇప్పుడింటికి పోదము.

వెం:—చిత్తము.

[అందఱు నిష్క్రమింతురు]

## 2

[బసిరెడ్డియిల్లు - రాత్రి 9 గంటలవేళ. ఇంటిలో బసిరెడ్డి, అతనిభార్య - వారియెదుట ముసలమ్మ నిలిచి యుందురు.]

బసిరెడ్డి:—అబ్బా! ఏమిచేసిన నేమిఫలము! పొంగలిడలేదా? పొంగలిదిగమ్రింగిన దేవునికి దయలేదా? ఈ దిక్కుమాలిన ఆకాశవాణి నాకడకొడలినే బలికోరవలెనా? తల్లీ ముసలమ్మా! నీమూర్ఖపు పట్టు వదలు. నీవు మా కందఱకు మేల్బంతివి. ఒజ్జవు. అంతయేల? ఈ గృహమునకు దీపతుల్యవు. నీవులేని యీ బ్రదుకు మా కక్కఱలేదమ్మా. అయ్యోదేవుడా! తలచుకుంటే గుండెలు తరుగుకొనిపోవును.

ముసలమ్మ:—మామగారూ! తెలియనివారికి నీతులుగఱపవలసిన మీరే యిట్లాడిన నేనేమిచేయుదును? పరోపకారములను మించినధర్మములేదుకదా? తోడిమానవునకు సాయముచేయనితనువు ఉండిననేమి, మండిన నేమి? అందులో పరోపకార, శౌర్య, సాహసములకు అందెవేసినచేయికదా మనరెడ్డికులము? అది యీనాడు ఒకపరోపకారిని కనలేక గొడ్డుపోయినదన్న ఎంతఅవమానము! ఎంతకళంకము! ఎంతతలవంపులు! క్షమించండి. ఏదోశరీరముతెలియక మాటాడినాను. సెలవివ్వండి, అత్తయ్యా, మామయ్యగారూ.

బసిరెడ్డి:—(కన్నీళ్లదుడిచికొనుచు) అమ్మా! అట్లనిన మేము చేయునదేమి? ఏదో మాగుండెబరువు పట్టలేకచెప్పినాము. అదిగో! నీ మగడు వచ్చుచున్నట్లున్నాడు. మేముపోయెదము.

[బాలిరెడ్డి ప్రవేశించును]

బాలిరెడ్డి:—ప్రేయసీ! (అని ముసలమ్మను కౌగిలించుకొని పరితపించుచు) ఇదిగో! నిన్నేనమ్ముకొని జీవించు నాగతి యేమికావలె ననుకొన్నావు? నేనుకూడ నీతో చెఱువుకట్టకుబలియై ఆకాశవాణికోరిక తీర్చెదను. నీవులేనిజీవితము నాకువద్దు. ముమ్మాటికినివద్దు.

ముసలమ్మ:—శ్రీహరీ! మీమాటలు విన్నప్డెల్ల ఎండకు మంచువలె నా హృదయములుకరిగిపోవును. ఔను. మిమ్ము మనసార ప్రేమించినాను. నూరుజన్మాలకైన మిమ్మే నాథునుగా కోరుచున్నాను. కాని, ఇట్లు ఈ వ్యర్థపుజీవితముగడపి మరణమందినయెడల ప్రయోజనమేమి? జ్ఞాపకమున్నదా? ఒకనాడు మీరే సెలవిచ్చినారుకదా ఈ లోకములో పరోపకారిజీవితమే అత్యుత్తమ జీవితమని. ఎంగిలికూడుతిని కాకి చిరకాలము బ్రదుకుటలేదా? దాని నెవరుమెచ్చినారు. నాయీ ఒక ప్రాణత్యాగమువలన అనేకజంతువులు, ప్రజలు బ్రదుకగలుగుదురనిన నా కంతకంటె కావలసినదేది? అట్టిమీభార్యను మీరు సంతోషింపరా? అట్టిది అందఱకును లభ్యమా? కనుక అటువంటిదే-నిర్భయముగా, నిర్వికారముగా, నిశ్చయముగాచనిపోవునదే-నేనును యిచ్చగించునది. పోనీ యిందుకు ఏమందురు? ఏమి! ఏడ్చుచున్నారా! అబ్బా వద్దు, నా కడుపుచెక్కలగుచున్నది. నేను చూడలేను.

బాలి:—(ముఖమావలకుత్రిప్పి మౌనమవలంబించును.)

ముసలమ్మ.—సరే మౌనము అంగీకారసూచకమేమో! నేనిదే ప్రార్థన మందిరమునకు పోవుచున్నాను. త్వరగావచ్చెదనులెండు. మీరు మీగదిలోనుండుడు.

[నిష్క్రమింతురు]

## 3

[చెఱువుగట్టు-గట్టుచుట్టు యిసుకచల్లిన క్రిందపడనంత జనము మూగియున్నారు. అందఱు కన్నీళ్లు కార్చుచు ముసలమ్మవైపు తదేకదీక్షతో చూచుచున్నారు. త్యాగజీవి ముసలమ్మ మేళతాళములమధ్య మెఱయుచున్నది. తలచక్కగదువ్వినది. ముఖమునిండ పసుపుబూసినది. నుదుట పెద్దకుంకుమబొట్టు. దానితో సయ్యాటలాడుచున్నవి ఆమె నల్లని ముంగురులు.]

వీరారెడ్డి—తల్లీ! నీ మగడెంతధన్యుడోకదా! ఎట్టిసుగుణశీలను పడసినాడు! నీ అత్తమామల భాగ్యమపారము. ఐన హరిహరీ! నిన్ను చేతులారకట్టలో పాతిపెట్టుటకు చేతులాడునా? ఇన్నాళ్లు మా తలలోని నాలుకవైనావు. ఈ దినము మా అదృష్టదేవత మమ్మువిడిచిపోవునా? వద్దు, అమ్మా నిన్ను పోగొట్టుకొనలేము! నిశ్చయముగా నీవు అందాలబరిణె పరాగములదిన పూదీగవలెనున్నావు. అట్టి, నిన్ను మా స్వార్థమునకై బలిదానమర్పించుటా? అయ్యో, దేవుడా! మావెంత నీచపు బ్రదుకులు!

ముసలమ్మ:—రెడ్డిగారూ, సర్వ[illegible] తెలిసినవారికేమిచెప్పను? నాశరీరకుసుమమును దేవుడాశించినాడు కదా! కనుకదీని నాతనికే అర్పించుకుంటాను. దయచేసి దారివిడువండి. (కొంచెము ముందుకునడచి) గండిలోనేను దూకుటకై ఎందుకంతపరితపించుచున్నారు? రెడ్డిరాణులకు పిరికితనముబోయెనురా? వెనుకటి తేజము క్షణమాత్రము స్మరించండి! (చెరువుగండిని సమీపించి)

... ... ... స్వామీ......ఇదిగో ... ... ...

వీరారెడ్డి:—(చెవులుమూసికొని) రామరామ! పిడుగువంటిశబ్దము! ముసలమ్మ గండికిబలియైనది. అదేశధవుగా గట్టుకూడ బిగించినారు! ఎంతక్రూరకర్మమున కొడిగట్టినారు? ఎంతటి వీరాంగనయీమె! ఆనాడు అగ్నిగుండములోదుమికిన సీతాదేవిని మించినది!

ఐన అందరిని హాహాకరములనుంచివెడలినది. ఏ దేవుడో ఇష్టపడకుండిన యీ ప్రజలుకూడ నీకార్యము దలపెట్టియుందురా? చేసియుందరు! ముమ్మాటికిని చేసియుండరు!

(జనులవైపుచూచి) అయ్యో! మనమీదనమొక జాతిరత్నమును గోల్పోయినాము. కాదు, గంగ గలిపినాము! జీవితములో మనకందఱకు ఆదర్శముగానుండినది. ఆ తల్లి గొప్పగుణమే మమ్మెల్లర నింతవరకు రక్షించినది. కనుక మనమెంతయు కృతజ్ఞతచూపవలసియున్నది. ఈకట్ట ఆ దేవిపేరుతో నేటినుండి ''ముసలమ్మకట్ట'' అగుగాక! ఔను; మనమందఱ మా పవిత్రమూర్తిని ఆరాధించుదము. ఆతల్లి మనపూజల నందుకొనును. మనమేకాదు, ఈ ప్రకృతిఅంతా ఆమెకు పుష్పాంజలులు సమర్పించును. చూడండి, ఈ చెఱువునందలి భంగబాలికలుకూడ ఆ దేవిచరిత్రను అమృతమయగీతికలలో నెట్లుపాడుచున్నవో! దిక్కులింకను ప్రతిధ్వనించుచున్నవి!!

...సరే ఇచ్చటనిల్చినంత గుండెక్రుంగిపోవుచున్నది! దుఃఖము కబళించివేయుచున్నది!! నడువండి గ్రామానికి.

[అందఱు నిష్క్రమింతురు]

# పసుపులేటి రంగాజమ్మ



ప్రసిద్ధాంధ్ర దాక్షిణాత్య కవయిత్రి (క్రీ॥ శ॥ 1650 ప్రాంతము)

శ్రీనిడుదవోలు వేంకటరావుగారు ఎమ్. ఏ.



జగత్ప్రసిద్ధమగు విజయనగరసామ్రాజ్య విచ్ఛిన్నానంతరమున దక్షిణమున తంజావూరు, మధుర, పుదుకోట, సేలము, కార్వేటినగరము, మైసూరు, తురయూరు మున్నగుప్రదేశము లాంధ్రవాఙ్మయరంగములై ప్రకాశించినవి. వానిలో తంజావూరు ప్రథమము, ప్రసిద్ధము. తంజావూరును క్రీ॥ శ॥ 1614 నుండి 1633 వఱకు బరిపాలించిన రఘునాథనాయకుడు దక్షిణహిందూదేశము నేలిన ప్రసిద్ధరాజులలో నొకండు. ఈతడు మహాదాత, శత్రుజేత, కృతిప్రణేత, శరణాగతత్రాత, సంగీతసాహిత్య గాంధర్వవిద్యాధిష్ఠాత. (కృష్ణరాయనికి నీతనికిగల పోలికలకు నా 'తంజాపురాంధ్రవాఙ్మయము' అను వ్యాసమునుచూడుడు. (ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవసంపుటము, పుటలు 151-174) అపర కృష్ణదేవరాయలనఁదగిన రఘునాథభూపాలుడు తెలుగున కెల్ల వెలుగుదెచ్చిన విజయవిలాసకృతిభర్త. రఘునాథనాయకుని వెనుక నాతనికొమారుడు విజయరాఘవనాయకుడు తంజావూరిసింహాసన మధిష్ఠించెను. ఈతడును తండ్రివలె సాహిత్యవిద్యారసికుడు, బహుకృతిప్రణేత. (విజయరాఘవనాయకుని కృతులనుగూర్చి పైవ్యాసముచూడదగును.) క్రీ॥శ॥ 1633-1673 వఱకు 40 యేండ్లతడు రాజ్యముపాలించెను. ఈతఁడే తంజావూరినిపాలించిన కడపటి యాంధ్రనాయకరాజు. శ్రీ శివాజీ చక్రవర్తి సవతిసోదరుడగు వేకోజీ ఈతనిపైదండెత్తివచ్చి, తంజావూరిరాజ్యమున మహారాష్ట్రధ్వజమును నిల్పెను. ఈతనితోబోరాడి విజయరాఘవనాయకుడు రణరంగమున కీర్తిశేషుడయ్యెను. మహారసికుడును, మహాకవియు నగు విజయరాఘవనాయకునికాలమున తంజావూరు రాజాస్థానము సంగీతసాహిత్య నాట్యకళామందిరమై వెలసినది. ఈతఁడు తనకాలికి "సాహిత్యరాయ"మను (వీనినన్నంటిని నీతని యాస్థానకవి చెంగల్వకాళకవి తనరాజగోపాలవిలాసమున వర్ణించినాడు. అదియముద్రితము. గ్రంథవిస్తరభీతి వీనివర్ణన ముదాహరింపలేదు) పేర గండపెండేరము ధరించెడివాడు. తానుకూర్చున్న సాహిత్యసింహాసనముపై "శారదాధ్వజమ"ను పేర నొకధ్వజము విలసిల్లుచుండెడిది. భువనైకభోజుడగు నీతని యాస్థానమున "భరతసంగీతసాహితీ ప్రముఖవిద్యలాకృతులు గన్నచందాన" సంగీతసాహిత్య విద్యాచతురలగు, నాట్యకళావిశారదలు- సాహితీసరస్వతులు పెక్కుమంది విలసిల్లిరి. వారిలో కెల్ల నాయకురాలని చెప్పదగిన మేటి రంగాజమ్మ.

రంగాజమ్మకు రంగాజీయని నామాంతరము. ఈమెయింటిపేరు పసుపులేటివారు. తండ్రి వేంకటాద్రి. తల్లి మంగమ్మ. ఈమె విజయరాఘవనాయకుని యాస్థానకవయిత్రియై యీ క్రిందిగ్రంథములను రచించినది.

1 మన్నారుదాసవిలాసము- ప్రబంధము. 2 మన్నారుదాసవిలాసము- నాటకము. 3 ఉషాపరిణయము- ప్రబంధము. 4 రామాయణ సంగ్రహము. 5 భారత సంగ్రహము, 6 భాగవత సంగ్రహము.

ఇంతియేగాక సంగీతమున నీమె లలితఫణితిని మృదురసాస్పదములగు పెక్కు పదములు రచియించినట్లు, తన యుషాపరిణయావతారికయం దిట్లు చెప్పినది. "ఇంపుమీర నేనును శృంగారరసంబులఁ జెన్నుమీరు మన్నారుదాసవిలాసంబు వినిపించుచున్న సమయంబున

సీ॥ వేంకటేంద్రుని పుత్రి! వినుత సద్గుణధాత్రి!
ఘనయశోరాజి! రంగాజి! వినుము.
మాధుర్యమున మించు మన్నారు
దాసవిలాస ప్రబంధంబు లలితఫణితిఁ
గావించి, మిగులశృంగారంబు
గన్పట్టఁ బదములు మృదు రసాస్పదములగుచు
రాణింప రచియించి, రామాయణంబును
భాగవతంబును, భారతంబు
సంగ్రహంబుగ రచియించి సరసరీతి
మమ్ముమెప్పించితివి చాల నెమ్మిదనరఁ
బరగ హరివంశమున నుషాపరిణయకథ
తెనుఁగుఁగావింపుమిక నీవు తేటగాఁగ.

పైకృతులలో, మన్నారు దాసవిలాసము ప్రబంధమును, మన్నారు దాసవిలాసనాటకమును. (వీనిలో మన్నారుదాసవిలాస నాటకముతప్ప తక్కినవి రెండును నముద్రితములు.) ఉషాపరిణయమునుమాత్రమే మనకు లభ్యములగుచున్నవి. పైపదములుకూడ మనకు లభ్యముకాలేదు. కాని యీమె తన కృతులలో వాని నచ్చటచ్చట కూర్చుకొనియుండుటచే నుదాహరణమునకు మాత్రమే మనకు దొరకినవి.

రంగాజమ్మ కృతులనుగూర్చి యెఱుగుటకు ముందు నామె విద్యావైదుష్యమెఱుఁగదగినది. అది ఆమె గ్రంథముల కడపటఁగూర్చిన గద్యయే తెలుపగలదు. దానినిట నుదాహరించెదను.

"ఇది శ్రీమద్రాజగోపాలకరుణాకటాక్షవీక్షణానుక్షణప్రవర్ధమాన సారస్వత ధురీణయు, విచిత్రతర పత్రికా శతలిఖిత వాచికార్థావగాహన ప్రవీణయు, తత్ప్రతి పత్రికా శతస్వహస్త లేఖనప్రశస్తకీర్తియు, శృంగారరసతరంగిత పదకవిత్వమహనీయ మతి స్ఫూర్తియు, అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషావిశేష విశారదయు, రాజనీతి విద్యావిశారదయు, విజయరాఘవ మహీపాలవిరచిత కనకాభిషేకయు, విద్వత్కవిజన స్తవనీయ వివేకయు, మన్నారుదాసవిలాసనామ మహాప్రబంధనిబంధన కృతలక్షణయు, మహనీయ రామాయణ భారతభాగవత కథాసంగ్రహవిచక్షణయు, పసుపులేటి వేంకటాద్రి బహుజన్మతపః ఫలంబును, మంగమాంబా గర్భశుక్తి ముక్తాఫలంబును, రంగద్గుణ కదంబయునగు రంగాజమ్మ వచనరచనా చమత్కృతిం జెన్నుమీఱు ఉషాపరిణయ ప్రబంధమునందు తృతీయాశ్వాసము."

పై గద్యవలన నీమె రాజగోపాలదేవుని దయవలన కవయిత్రి యయ్యెననియు, వాచకత్వమునసేగాక, చిత్రవిచిత్ర శతలేఖినీవిద్యయందు ప్రవీణురాలనియు, నెనిమిది భాషలలో కవనముల్లగల నేర్పరియనియు, పదకవిత్వమున ప్రౌఢిమగన్నదియనియు, రాజనీతినెఱిగిన రమణియనియు, సరసశృంగారపదకవితయందు జాణయనియు, విజయరాఘవమహీపాలునిచే కనకాభిషేకము(కనకాభిషేకము చేయు విధానముగూర్చి చూడుఁడు: శృంగార శ్రీనాథము: గౌరవముచేయువ్యక్తిపై బిందెలతో బంగారునాణెములు స్నానముచేయునట్లు వెలువరింపవలెను. క్రిందపడిన యా నాణెములన్నింటిని తక్కినవారందఱకును పంచిపెట్టవలెను. ఇది కనకాభిషేకము. ఇందుకవికి గౌరవమేగాని కనకము లభింపదు) మహాగౌరవమునుబొందిన విద్యత్కవయిత్రియనియు తెలియుచున్నది.

కనకాభిషేకగౌరవము బొందుటయనునది సామాన్యవిషయముగాదు. లోకోత్తరప్రతిభాశాలియగు మహాకవికిగాని, విద్వల్లోక మకుటాయమానుఁడగు మహావిద్వాంసునికిగాని జేయదగిన మహాగౌరవములలో కనకాభిషేకమే ప్రధానమైనది. విజయనగరసామ్రాజ్యాధీశుఁడగు దేవరాయనిచే శ్రీనాథమహాకవి యీ సత్కారమును గాంచినవాఁడు. వ్యాఖ్యాతృచక్రవర్తి మల్లినాథసూరి సర్వజ్ఞసింగమహీపాలునిచే నీ సత్కారమును పొందినవాఁడు. కాని యింతవఱకు స్త్రీలెవ్వరును నిట్టి గౌరవమునుబొందినట్లు మనకు తెలియుటలేదు.

కవయిత్రియగు రంగాజమ్మ యిట్టిగౌరవమును బడయుట యాంధ్రలోకమును, నందు ముఖ్యముగా నాంధ్రమహిళామండలియు గర్వింపదగిన విషయము. అంతియేకాదు, ఆంధ్రవాఙ్మయచరిత్రమున నిది సువర్ణాక్షరములతో లిఖింపదగినది.

గద్యలో 'అతులితాష్టభాషాకవితా సర్వంకషమనీషావిశేషశారద' అనునది నీమెయెడల సార్థకమే. అష్టభాషలనగా 1 సంస్కృతము 2 ప్రాకృతము 3 శౌరసేని 4 మాగధి 5 పైశాచి 6 చూళిక 7 అపభ్రంశము 8 తెలుఁగు. అనునవి ఈ భాషలయం దీమె కవితావైదుష్యము తెలుపుటకు మన్నారుదాస విలాస నాటకమునుండి యుదాహరించుచున్నాడను.

సంస్కృతము

ఔదార్య మంగనృపభంగ విధాన ధుర్యమ్
శౌర్యంచ ధైర్యమపి శౌర్యపలాలనీయమ్
రూపంచ పంచశరవీర విలోభనీయమ్
యస్యాస్స్పృహా విజయరాఘవ సార్వభౌమ.

ప్రాకృతము

భద్ద దేయు పుణోతుహా చంపయరణ్ణప్పయేన సంచాళో
హారిద్దణం యితడుజ్జ్వల మందిర విహాయీయరాయ గోపాళో.

శౌరసేని

విదదయసో వత్తదిసో జయయిసుహుద్దణ్ణదోసేసో
కణ్ణపదబత్తిసీలో మణ్ణారుదాసో మహీపాలో.

మాగధి

పుశుపశరాసన శరిసే రూవేణ హరియ్య మహిమాయే
దాణేహఙరాహేయే వియఝి రహునాహశామి సంతాణే.

పైశాచి

సౌవణ్యగునవంతో బమ్మనహచ్చాను పూళనద్దమహదానో
అయ్యవెన్నసమానో లోకవిలోకస్స పున్నిమచందో.

చూళిక

ఖమళవిలోచనమధనే యాచకఘణ ధావ్యపాధపో సేసో
భాహాభళభళవద్దో అరవికారయ వియయరాఘవో వియయ.

అపభ్రంశము

పుణు కావిగోడి తుంహో దట్టూణ మణేన్నరూపు అసమాణు
తాయి యనిబ్భరవిరహ పుహవు మణ్ణారుదాసు భూపాలు.

తెలుగున నామె గ్రంథకర్తయే గావున నుదాహరణమీయలేదు. సంస్కృతపదకవిత్వమునందీమె చతురయనుటకు నీమెరచించిన చూర్ణిక - రూపకతాళవర్ణములు మొదలగునవి తెలుపును. ఈమెకు సంస్కృతవ్యాకరణమున మంచిప్రవేశముగలదనుటకు, మన్నారుదాసవిలాసమున నొకచో నీమె వ్రాసిన వ్యాకరణశాస్త్ర ప్రసంగమే యుదాహరణము. గ్రంథవిస్తరభీతిచే వాని నుదాహరింపలేదు. (సశేషము)






# కోకిల

శ్రీమతి ఆలపాటి సీతారామమ్మగారు

మామిడి గున్నలమీదా
మనసానందముతోనూ,
తోటి పక్షులూ
తోడు బలుకగా.
కంఠధ్వనులూ
కలకలలాడగ
పాడిందీ;
కోకిల — పాటలు —
పాడిందీ.

చిరుకొమ్మలపైన
చిగురుటాకులందూ,
మేఘవర్ణమై
మెరయుచుండగా,
చూచువారలూ
చోద్య మొందగ,
పలికిందీ;
కోకిల — పలుకులు —
పలికిందీ.

పూదోటలలోన
పున్నమ రాత్రులందూ,
వనవిహారులగు
వనితాగణములు,
వినికూజన
వింతనొందగను,
కూసిందీ;
కోకిల- "కూ" "కూ" —
కూసిందీ.

పున్నాగంబులలోన
పుష్పగుచ్ఛమందు,
బాటను బోయెడు
బాటసారులకు,
వింతవింతగను
వింతలుగొలుపగ,
తీసిందీ;
కోకిల — రాగము —
తీసిందీ.

# అంతరార్థం



శ్రీమతి భూషి అన్నపూర్ణాదేవిగారు.



"సరూ! మీ యక్క ముసలిదైనతర్వాత నిన్నుపెళ్లిచేసికుంటానే!" అని-మాబావ నన్నెత్తుకొని గట్టిగ బుగ్గగిల్లాడు.

తలంటుకొన్నతర్వాత, వరండాలో బాలసూర్యునికిరణాల్లో జుట్టు ఆరబెట్టుకుంటోంది మాయక్క ఈజీచెయిరులో కూర్చొని.

బావచంకదిగి, మాఅక్కఒడిలో అమాంతంగకూలబడ్డా. నన్ను ముద్దెట్టుకొని తలనిమురుతూ "కాదే మీబావ నేను చచ్చిపోయినతర్వాత నిన్నుపెళ్లిచేసికుంటారే!" అంది చిరునవ్వుతో.

"ఏమిటా అపశకునపు మాటలు" అన్నాడు బావ కొంచెంకళ్లెఱ్ఱచేసి.

"క్షమించండి. కోపంవస్తుందనుకోలేదు. తమాషాకే అంతపట్టించుకొంటే, ఎలాగ?"

"తమాషా అయితేమాత్రం అమంగళపుమాటలా?" అంటూవచ్చి అక్కప్రక్కను కుర్చీలో కూర్చున్నాడు.

"తెలివితక్కువతనంగ ఏమన్నాఅంటే క్షమించాలి." అంది బావచేతిని నొక్కుతూ.

బావ చిరునవ్వుముఖంతో అక్కకేసిచూచాడు. ఆమెముఖంలో చిరునవ్వుతాండవమాడుతుంది. బావ అక్కబుగ్గ గిల్లాడు.

ఒడిలోకూర్చున్ననేను మెల్లగ బావవ్రేలిఉంగరంతీసుకొని నా వ్రేలికి తగిలించుకొన్నా.

"చూచారూ.........సరూ మీ ఉంగరాన్ని కాజేసింది ఇంతలోనే" అంది మా అక్క.

"అరె! చాల పోకిరిదానివయిపోయావె!" అన్నాడు నా బుగ్గగిల్లి.

అప్పుడు నాకు పట్టుమని పదేళ్లుండవు. ఆవేళ ఉగాది. బావ, అక్క, అత్తా అందరం 8 గంటలకే స్నానంచేశాం. కుర్చీలోకూర్చొని ఆ లేతసూర్యునికిరణాల్లో తలవిరియపోసికుంది.

బావ మామిడిపిందెలు, వేపపువ్వు బజారునుంచి తీసికొనిరావడానికివెళ్లాడు. అక్కకు అకస్మాత్తుగ అమ్మ జ్ఞాపకానికొచ్చింది. నన్నెత్తుకొని గదిలోనికితీసికొనివెళ్లి గ్రుచ్చినమల్లెపూలు అమ్మఫోటోకితగిలించి నమస్కరించింది. నా ముఖంలోకి ఎంతోదీనంగచూచింది. ఆమెకన్నులనుండి చొటచొటకారిందికన్నీరు. అమ్మను తలంచుకోగానే నాకుకూడ కళ్లనీరు తిరిగింది. అమ్మఫోటోకి చేతులుజోడించాను. అంతలోబావ బజారునుంచివచ్చాడు. అక్కను ఎంతో ఓదార్చాడు.

మా అక్క చాలఅందకత్తె. మా అమ్మ అంతకంటె అందంగాఉండేది. మా యమ్మపోలికలే నాలో కూడ ఉన్నాయంటారు అందరూను. అమ్మజ్ఞాపకానికొచ్చినప్పుడెల్ల, అక్కనన్నెత్తుకొని నా ముఖంలో అదోలాచూచేది.

అందుగురించే, నన్ను తనవెంట అత్తారింటికితీసికొనితెచ్చుకుంది. మా అక్కకు పెండ్లయినసంవత్సరానికే మశూచికంలో అమ్మచనిపోయింది. అక్కనుచూస్తుంటే అమ్మలేనికొఱత కనుపించేదికాదు.

బావ నన్నెంతో ప్రేమగ, జాలిగచూచేవాడు. అంతకంటె ఎక్కువగచూచేది అక్క. బావఎప్పుడైనా ఏదైనా తినడానికితీసికొస్తే అక్కముందు నాకుపెట్టేది. ఇద్దరికి ఎంతో అల్లారు ముద్దుగఉండేదాన్ని.

బావ పాటలునేర్పేవాడు. లెఖ్ఖలుచెప్పేవాడు. తప్పువస్తేమాత్రం గదురుకొనేవాడు. చటుక్కున అక్కవచ్చి "చంటిపిల్ల, గదురుకోకండిమరీని" అని లోపలకుతీసికెళ్లి చేతిలోఏదైనపెట్టేది.

ఒకనాడు అక్క నాచేతిలో లడ్డుపెట్టి తినమంది. మెల్లిగ బావ వెనకాలేవచ్చి, "అంతా మీ చెల్లికే పెట్టుకోకపోతే నా కొకటివ్వగూడదా?" అన్నాడు. మెల్లగ ఒకలడ్డూ బావనోటిలోనికి తోసింది.

"ఏమే సరూ! నామీద నీకుకోపం గదటే?" అన్నాడు. లేదన్నట్లుగ తల నూపాను.

"వొర్రిది కోపంలేకపోతే ఏదీ ఆ లడ్డూనాకియ్యి?" అని నోరుతెరిచాడు.

అక్కఒడిలోనుండి సగం తిన్న ఆ లడ్డూను బావనోటికందించాను. గుటుక్కునమ్రింగాడు కొంటి బావ. అక్క విరగబడినవ్వింది. మరల చెరియొకలడ్డూఇచ్చిందిమాకు. కాని తనకిచ్చినదాన్నితిరిగి అక్కకిచ్చాడుబావ.

* * * *

"సరూ! ఇదిగోతెచ్చాను. మామిడిపిందెలున్నాయిగాని, వేపపూవుదొరకలేదు. దానికిబదులు వేపచిగురుతెచ్చాను." అంటూగదిలో ప్రవేశించారు మావారు. నేను అమ్మ, అక్కఫోటోలదగ్గరనిలబడి కన్నీటతర్పణమిస్తున్నాను.

"సరూ! సరూ! ఎంతకాలం విచారిస్తేమాత్రం ఏంలాభం. పోయినవాళ్లని తిరిగితీసికొనిరాలేం గదా? అంతామరచిపోవాలి" అన్నారు గద్గదంగ. వీపుతట్టి నన్ను చేయిపట్టుకొని వెలుపలికి తీసికెళ్లారు. వెల్లువలైపారుతుంది మా ఇద్దరికన్నీరు.

హృదయానికి హత్తుకుంటూ నన్ను బుజ్జగించసాగారు. హృదయావేదనఆగక బావురు మన్నాను.

బావురుమంటూలేచింది మాశశి. దాన్నెత్తుకొని అమ్మ, అక్కల పోటోలదగ్గరికితీసికెళ్లి చేతులు మోడ్చాను. చిట్టిశశికూడ చేతులుజోడించింది. వాళ్లనాన్ననుపిల్చి చేతులుజోడించమంది. ఫోటోలకి రెండు వైపులా అగరువత్తులు వెలుగుతున్నాయి.

చిట్టితల్లిదంతా అక్కవాలకమే. అక్కముఖంలోని తాత్వికదృష్టులు ఆమెముఖంలో ప్రస్ఫుటంగ కనుపిస్తున్నాయి. అక్కలాగే, చలనంలేకుండ ప్రేమవేదాంతిలా నా ముఖంలోకి చూస్తుందిశశి. చిట్టితల్లి ముఖంలో అక్కతొంగిచూస్తుందా అనిపించింది.

"సరూ! నేనుచనిపోయినతర్వాత నిన్నుపెళ్లిచేసికుంటారే!" అని ఎప్పుడో.........ఈనాడే అన్న అక్క మాటలు నాచెవుల్లో రింగుమన్నాయి. ఆమెమాటల్లో ఇంత అంతరార్థం ఉందని అప్పట్లోతెలియలేదు.

***



1947 డిశంబర్-6-వ తేది :—

శ్రీమతి సరోజినీదేవిగారిని యు. పి రాష్ట్రమునకు ఖాయంగవర్నరుగా నియమించిరి.

లాహోరులో పంజాబు మతకలహములందు అపహరింపబడిన స్త్రీలవిషయమై ఉభయరాజ్యాలకు చెందిన మహిళామణుల సమావేశంజరిగింది ఉభయరాజ్యాల మంత్రులు హాజరైనారు.

కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో స్త్రీపట్టభద్రలకు పురుషపట్టభద్రులతో సమానమైనహక్కులివ్వబడినవి.

,, 8 ,, కేంద్రశాసనసభలో శ్రీమతి రాజకుమారి అమృతకార్ (ఆరోగ్యమంత్రిణి) ఇండియన్ నర్సింగ్ కౌన్సిల్ బిల్లు ప్రవేశపెట్టినది.

,, 13 ,, మద్రాసులోజరుగుతున్న అఖిలభారత మహిళామహాసభకు ప్రతినిధులుగా ముగ్గురు ఇండోనేసియా నారీమణులు బటేవియాలో బయలుదేరినారు. వారితో హీరావతీదియా అనేఆమె 'మెరిడికా' అని వారి పత్రికా విలేఖరిగా వారితోవస్తున్నది.

,, 14 ,, శ్రీమతి సరోజినీదేవిగారికి కిరోజున కాశీహిందు విశ్వవిద్యాలయ స్నాతకోత్సవమున డాక్టరు ఆఫ్ లెటర్స్ అనేడిగ్రీ ఇవ్వబడినది.

,, 15 ,, ఢిల్లీకి గాంధీవద్దకు వస్తున్నఇద్దరు సిఖుస్త్రీలను (తల్లి, కూతుండ్రు) లాహోరువద్ద ఎవరో దుర్మార్గులు, రైలులోనుండి క్రిందవిసరివేశారు. కూతురికి కాలువిరిగింది.

,, 16 ,, మద్రాసుగవర్నరు సతి మద్రాసులో పేదవారి పూరిగుడిశలను, చెట్ పట్ లోని చాకిరేవులను సందర్శించినది.

,, 17 ,, త్వరలో సైనికులు, పోలీసులువెంటరా, సంఘసేవికలు కొందరు పాకీస్థానములో అపహృతహిందూనారీమణుల వెతుకవెళ్లుదురు అని ఢిల్లీలో ప్రభుత్వం ప్రకటించినది.

,, 18 ,, కరాచీలో శరణార్థులువచ్చి ఇతరులఇండ్లలో బలవంతముగాదూరి మకాముచేస్తున్నారు. అట్టివారిలో స్త్రీలవిషయమై బందోబస్తుచేయనుప్రభుత్వమువారు స్త్రీలనుపోలీసులుగాచేర్చుకున్నారు.

,, 18 ,, శ్రీ రాధాకృష్ణన్ గారు కాశీహిందూ విశ్వవిద్యాలయోపాధ్యక్షతకు రాజీనామానివ్వగా దానిని వారుపసంహరించుకోవలయునని స్త్రీలకళాశాలలో విద్యార్థినులుసమ్మెకట్టినారు, వారిలో 4గురు నేటినుండి నిరశనవ్రతమారంభించినారు.

,, 19 ,, నాన్ గెజటెడ్ ఆఫీసర్ల సమ్మెసందర్భమున ఈ రోజునసాగిన ఊరేగింపులో యువతులు ప్రభుత్వోద్యోగులుకూడాచేరినారు. వారిపై అశ్రువాయువు బాంబులువ్రేల్చగా రెండుబాంబుల మధ్య చిక్కుకొన్నయువతి అక్రేలుడుకు మూర్ఛాన్వితఅయినది.

20 వ తేది 1947 డిశెంబరు

కాకినాడ ఫారెస్టుఆఫీసరు కాపురమున్న ఇంట్లో వెనుక మిలిటరీఆఫీసరుండేవాడట. అతడు విడిచి పోయిన కొన్నిసామానులలో బంతివలెవున్నవస్తువుతో ఆ ఆఫీసరు నౌకరు, కూతుండ్రిద్దరు కొద్దిరోజులనుండి ఆడుకుంటూరాగా ఈ రోజున నౌకబంతి (అది బాంబు) ప్రేలి వారిద్దరికి గాయాలైనవి.

,, 20 ,, మద్రాసు రాష్ట్రపశుసంరక్షకమహాసభ శ్రీమతి రుక్మిణి అరండేల్ గారి అధ్యక్షతక్రింద మద్రాసులో జరిగినది.

,, 20 , బ్రిటిష్ రాజకుమారి ఎలిజబెత్ తన వివాహపుకట్నాలక్రింద వచ్చినరొఖం 13000 పా॥ లు ధర్మకార్యాలకిచ్చివేసినది.

,, 21 ,, మద్రాసు స్త్రీ సదనమున మోప్లావధూవరులకు ఇస్లాంమతానుసారం వివాహముజరుపబడినది. ముస్లిముల వివాహముజరుపుటకు స్త్రీసదనమున కదే మొదలు.

,, 24 ,, శాంతినికేతనమందలి విశ్వభారతిపట్టభద్రులకు యు. పి. గవర్నరు శ్రీమతి సరోజినీదేవి స్నాతకోపదేశ మొసంగినది.

,, 25 ,, అఖిలభారత మహిళామహాసభయొక్క 20 వ సమావేశమున కధ్యక్షురాలగు శ్రీమతి అనసూయాబాయికాళేగారు నాగపురంనుండి మద్రాసుకు విమానముమీదవచ్చిదిగినది. స్థానికమహిళామణులు పలువురు వారికి ఘనమగుస్వాగతమిచ్చిరి.

,, 25 ,, అమెరికాలో "శకుంతల" ఫిల్ము చూపబడినది. అమెరికనులు తమదేశములో మొదటచూచిన భారతీయఫిలుము ఇదే. జయశ్రీ ఇందు శకుంతలపాత్ర నటించినది. శాంతారాం ఈ ఫిల్ము డైరెక్టు చేసినారు.

,, 25 ,, ఈరోజున చీనాలో నూతన చీనారిపబ్లిక్ రాజ్యాంగధర్మము అమలులోనికివచ్చినది. దీనిలో స్త్రీ పురుషులకు సమానత్వ మివ్వబడినది.

,, 26 ,, బర్మామాజీప్రధాని ఆంగ్ సేన్ మరిఆర్గురుమంత్రులు హత్యగావింపబడియున్నారుగదా. వారి కుటుంబముల రక్షణార్థమై రు 700000 లను బర్మాప్రభుత్వమువారు మంజూరుచేసి దాని పరిపాలనకు ట్రస్టీలనేర్పరచినారు.

,, 26 ,, రష్యాలో ఇర్వురు స్త్రీలకు 1502 సిగరెట్టుప్యాకెట్లను, 6400 నాణెములను దాచియుంచిరని చెరి 10 సం॥ ల శిక్షవిధించినారు.

శ్రీమతి రాజకుమారి అమృతకార్ గారు కేంద్రఆరోగ్యశాఖామంత్రిణి అ. భా. మ. మహాసభకు హాజరగుటకై మద్రాసు విచ్చేసినారు.

,, 26 ,, రష్యాలో భారతయూనియన్ ప్రభుత్వరాయబారి శ్రీమతి విజయలక్ష్మిపండిట్ భారతదేశమునకువచ్చియుండి నేడుతిరుగ విమానముపై మాస్కో వెళ్లినది.

27 వ తేది 1947 డిశంబరు

శ్రీమతి రాజకుమారి అమృతకౌర్ బ్రిటిష్‌యెంపైర్ కుష్ఠురోగనివారణసంఘపు మద్రాసుశాఖ క్రొత్తఆఫీసునకు ప్రారంభోత్సవము సల్పినది.

,, 27 ,, చింతాద్రిపేట హైస్కూలు శతవార్షికోత్సవ సందర్భమున విద్యావిషయక, కళలచేతిపనుల ప్రదర్శనము నేర్పాటుచేయగా దాని ప్రారంభోత్సవమును మద్రాసు గవర్నరు సతిగావించినది.

,, 30 ,, విజయనగరం మహారాణీసాహేబ్ వారు అఖిలభారతమహిళాసభా ప్రతినిధులకు విందుగావించిరి, గవర్నరుదంపతులు, ప్రధానమంత్రికూడా విచ్చేసిరి. కళాక్షేత్రవిద్యార్థులు ఆటపాటలు ప్రదర్శించిరి.

,, 30 ,, పశ్చిమబంగాళా శాసనసభ్యురాలు శ్రీమతి వీణాదాసు శ్రీజ్యోతిష్‌భౌమిక్‌ను వివాహమాడినది.

2 వ తేది 1948 జనవరి

చెన్నపురియందలి మహారాష్ట్రసంఘములు మహిళామహాసభాధ్యక్షురాలగు శ్రీమతి అనసూయాబాయి కాళేగారికి సన్మానమొసంగినవి.

,, 7 ,, మద్రాసు గవర్నరుసతి మద్రాసులో పుదుపేట పాకీవాండ్ల గుడిశలుదర్శించి వెంటనుండిన కార్పొరేషన్ కమిషనరుతో వారికికొన్ని సౌకర్యములొనర్చుమని సలహానిచ్చినది.

,, 8 ,, శ్రీమతి యశోదాదేవికన్యా ఎం. ఏ. ఎం. లిట్ గారికి మద్రాసు 'విద్యాలయమువారు డి. లిట్ (డాక్టరుఆఫ్ లిటరేచర్) బిరుదమునొసంగినట్లు నేటిహిందూపత్రిక ప్రకటించినది.

# 1948 జనవరి 2 వ తేదీన ఆంధ్రదేశమంతటా విడుదల

ఆ నిలువు వయస్సుకత్తెకూ ఆ పసికందుకూ యేమిటో సంబంధం! ఆమె కన్నవారికీ—ఆమె కన్నుల గన్నవారికీ—
ఆయిద్దరూ తల్లీ కొడుకులు—అయితే, ఆమె భర్తయెవరు? ఆ కందును కన్నవారికే తెలియాలి ఆ సత్యం!
బ్రతుకులో తెరుగని లోకం ఆమెను నిరాదరించింది—బ్రతికి తనిసిన వృద్ధదంపతు లామెను
ఆదరించారు—వారెవరో—నిజం తెలిసిన దేవతలేమో—చూడండి.




★

దర్శకుడు:

రామకృష్ణ

★

భానుమతి,
డా॥ సుబ్బారావు
సి. ఎస్. ఆర్.
నాగేశ్వరరావు,
ఆరణి,
సూర్యనారాయణ,
బేబీ సుమిత్ర,
సీతారాం,

మొదలైనవారు.

★

రచన:

సముద్రాల

★

సంగీతం:

సుబ్బరామన్

★

స్టూడియో:

న్యూటోన్

★

## భరణీ వారి

# రత్నమాల

నిర్మాతలు
భరణీపిక్చర్సు
మద్రాసు-17.

పూర్ణా పిక్చర్సువారి విడుదల

# శ్రీమతి అనసూయాబాయి కాళే గారి జీవితము

## 20వ అఖిలభారత మహిళా మహాసభ అధ్యక్షురాలు

"శ్రీమతి అనసూయాబాయి కాళే గారికి అధ్యక్షత నప్పచెప్పుటకు గర్విస్తున్నాను. ఆమె చాలవయసు చెల్లినపనిమంతురాలు—వయసు చెల్లడం సంవత్సరాలలో కాదు, అనుభవంలో. స్త్రీలనుద్ధరించడం, వారి అభివృద్ధికై పాటుపడటం—ఆమె ఎప్పుడూ దీక్షవహించి గావిస్తున్న కార్యక్రమము. ఆమె అభిప్రాయము లెప్పుడునూ పురోభివృద్ధికరమైనవి." అని పూర్వాధ్యక్షురాలైన శ్రీమతి రామారావుసతి నూతనాధ్యక్షురాలిని అధికారమప్పచెప్పుతూ పల్కినది.

ఈమె మధ్యరాష్ట్రాలలో జన్మించినది. ఈమె మహారాష్ట్రీయువతి. సామాన్యంగా అందరు స్త్రీలవలెనే ఈమెయున్నూ పూర్వాచారసాంప్రదాయములమధ్యనే పెరిగినది. చిన్నప్పుడొకసారి బరోడాలో జడ్జీ తయ్యాబ్జీగారింటికి ఇతర స్నేహితురాండ్రతో కలిసి తేనీటి విందుకువెళ్ళడం తటస్థించింది. అయ్యో బ్రాహ్మణపుటకబుట్టి తురకయింట తేనీరు త్రాగితినేనని ఆమె చాలా చింతించింది. వెలివేస్తేఎట్లాగా అని చాలా భయపడ్డదికూడా! ఎక్కడిఆరోజులు- ఎక్కడిఈరోజులు!

గాంధీమహాత్ముని నాయకత్వంక్రింద రాజకీయాలవైఖరే మారింది. పాశ్చాత్యవిద్యాధికులు, ధనవంతులు, రాజనీతిచతురులు అయినవారే అంతకుముందు రాజకీయాలలో జోక్యంకలుగజేసుకొనేవారు. కాని గాంధీ ప్రజాసామాన్యానికంతా స్వరాజ్యనినాదం నేర్పి, జాతీయపతాకంచేతికిచ్చి శాంతియుతంగాపోరాడమన్నారు. అంతఃపుర స్త్రీలు సమేతూ వీధిలోకివచ్చి దేశభక్తిప్రపూరితమైన కార్యకలాపాలలో పాల్గొనసాగినారు.

స్వాతంత్ర్యసమరం—అనేసరికి ఒక్క రాజకీయస్వాతంత్ర్యంతో అది సరిపుచ్చుకోదు. గాంధీయున్నూ తనకార్యక్రమంలో కేవలంరాజకీయాలేగాక భారతీయస్త్రీపురుషులకు భావదాస్యంపోగొట్టి భావస్వాతంత్ర్యం చేకూరడానికి అనువైననైతికసాంఘికకార్యక్రమంకూడా చేర్చినారు. అందుచేత చిరకాలంగా వంటఇంట, అంతఃపురంలో కట్టుబడియున్న స్త్రీ స్వేచ్ఛాస్వప్నములగాంచింది, స్వేచ్ఛాకిరణములచూచింది, స్వేచ్ఛాపతాకంచేబూనిరంగంలో ఉరికింది.

అలా ఉరికిన అసంఖ్యాకులైన స్త్రీరత్నములలో శ్రీమతి అనసూయాబాయి కాళే గారొకరు. 1928లో ఆమెనడుముకట్టి కార్యరంగంలోనిలిచింది. అంతవరకు నారీసభలలో ఎన్నికలపద్ధతిలేదు. ఎవరో అభిమానంగల స్త్రీలు ప్రతినిధులుగావచ్చేవారు. నారీలోకంఅంతాచకితమై నారీసభలసందేశం ప్రతినారీమణి చెవికి, మదికి ఎక్కాలంటే ఎన్నికలపద్ధతిరావాలని ఆమెతీవ్రంగాపోరాడింది. విజయంపొందింది. అప్పటినుంచి సభలకు తమప్రతినిధిని, సరియైనప్రతినిధిని పంపాలనేఆత్రము నారీలోకంలో మూలమూలలకలిగింది. ఏవిద్యాధికురాండ్రో కొందరుచేసేహడావుడికాదిది—సరియైనఎన్నుకోబడిన స్త్రీప్రతినిధుల అభిప్రాయమిదియని వారితీర్మానాలకు నాటినుండి ఒకమన్నన ఏర్పడినది.

1942లో విప్లవంచెలరేగింది. ఆ విప్లవఫలితంగా స్వాతంత్ర్యంతప్పదు. శ్రీమతి అనసూయబాయి వంటి వారిదృష్టిఅంతా ముందుపరుగిడుతుంటుంది. రానున్నస్వాతంత్ర్యము అనుభవించను స్త్రీలను తయారుచేయవలయును. ఆ సం|| మున ఈమె నాగపురంలో "భగినీసమాజం" అని ఒకటి ఏర్పరచినది. నలుగురని చేరదీయను ప్రారంభంలో కేవలం వక్తృత్వపోటీలుమాత్రమే జరిపించింది. వక్తృత్వపుపోటీఅంటే వివిధవిషయములు చర్చించాలిగదా! దానితో స్త్రీలలో ఎక్కడలేనిప్రబోధంకలిగింది. ఆ సమాజంబాగా అభివృద్ధిచెందింది. నేడుదానికొక పెద్దభవనం, ఒకపుస్తకభాండాగారము; దానియజమాన్యమున ఎన్నో బాలబాలికాపాఠశాలలు నడుస్తున్నవి. ఇంకా అనేకవిధాలసంఘాలు, సమితులు, స్త్రీలకు, పేదలకు ఏర్పాటైనవి.

ఆష్టీలోను చీమూరులోను స్వాతంత్ర్యంకోసం యువతీయువకులు వీరసాహసాలుచేశారు. ప్రభుత్వపుతాబేదార్లకది కంటకమై వారిచర్యలణచను ఘోరమైనదండగాలుచేశారు. అయినా వీరయువకులను



మహాసభా ప్రతినిధులకు మద్రాసు మేయరుయిచ్చిన
టీపార్టీలో: శ్రీమతి కమలాదేవి ప్రభృతులు పానీయములుగ్రోలుట.



సింహళ ప్రతినిధి ఉపన్యసిస్తున్నది.
కూర్చున్నవారు :- మద్రాసు గవర్నరుసతి-రాజకుమారి అమృతకౌర్.





గతసంవత్సరపు అధ్యక్షురాలు శ్రీమతి రామారావుసతి
మహాసభ స్వచ్ఛంధ సేవికలకు పతాకారోహణానంతర ముపన్యసించుట.



'రత్నమాల'లో
డా॥ గోవిందరాజుల సుబ్బారావుగారు



కొందరినిపట్టుకొని ఉరిశిక్షలువిధించారు. దేశమంతా ఆ స్వాతంత్ర్యవీరుల ప్రాణసంరక్షణార్థమై అలమటించింది. అప్పుడువారితోకృషిచేసి వారిని ఉరికంబములనుండి కాపాడినవారిలో ధన్యురాలు—ఈమెయే.

ఆమెఎంతతీవ్రభావోపేతయైనా చాలానిదానంగలది. సదసద్వివేకమెఱింగినది. మధ్యరాష్ట్రాలలో మహారాష్ట్రులకు మహాకోసలులకు పోరాటంఅని ఆమెయే తన అధ్యక్షోపన్యాసంలోచెప్పినది. ఆ పోరాట ఫలితంగా శాసనసభ్యులలో కొన్ని అలజడులుకలిగినవి. 1937 లో కాంగ్రెసు శాసనసభ్యురాలామె. 1945 లో ఆమెను అభ్యర్థిగాఎన్నుకోలేదు. అయినా ఆమెనిదానంచూపి తనబదులు అభ్యర్థిఅయినఆమె తరఫున తీవ్రంగాపనిచేసి ఆమెనుగెల్పించినది. నిజంగా ఈ సహనము పురుషులలోనే చాలావరకు మృగ్యముకదా.

1929 కార్మికులకర్షకులవిషయమై మధ్యరాష్ట్రాలలో "రాయల్‌కమిషన్" ఏర్పాటైంది. ఈమె చాకచక్యంగ్రహించి ఈమెను మధ్యరాష్ట్రముల ప్రభుత్వంవారు అసిస్టెంటులేబరు కమిషనరుగా ఏర్పాటు చేసినారు. ఆ పదవిలో స్త్రీ కార్మికులకై ఈమె చాలాకృషిచేసి వారికెన్నో సౌకర్యములు నేర్పరచినది

ఈ విధముగా కార్మికరంగంలో,- రాజకీయరంగంలో, సాంఘికరంగంలో, శాసనసభారంగంలో, అధికారరంగంలో సంపూర్ణమైన అనుభవంగల స్త్రీరత్నం—ఈ సంవత్సరం—స్వాతంత్ర్యసిద్ధి అనంతరం ప్రథమసంవత్సరం — భారతమహిళామహాసభా వ్యవహారం నడుపు అవకాశంకలగడం భారతమహిళల భాగ్యంఅనకతప్పదు.



# 20వ అఖిలభారత మహిళామహాసభలో

# * గావింపబడిన తీర్మానములు *





1 శ్రీమునగాలరాణి మున్నగువారి అకాలమృతి యెడల సానుభూతి.

2 శ్రీమతి సరోజినీదేవిగారు గవర్నరుగాను, విజయలక్ష్మి పండిట్ గారు రష్యారాయబారిగాను, రాజకుమారి అమృతకౌరుగారు ఆహారశాఖామంత్రిణిగాను, రాణీ లక్ష్మీబాయి (రాజ్వాడా) గారు ఏషియన్ రిలేషన్స్ కాన్ఫరెన్సుకౌన్సిల్ ప్రతినిధిగాను, కామేశ్వరీ నెహ్రూగారు రిలీఫ్ అండు రిహాబిలేషన్ మంత్రిత్వముక్రింద స్త్రీలశాఖకు డైరెక్టరుగాను నియమింపబడినందులకు సభవారు తమఆహ్లాదమును వెలిబుచ్చిరి.

3 హిందూకోడ్ పునర్నిర్మాణము ప్రభుత్వముగావించుటలో చాలవరకుఆలస్యము తప్పనిసరియైనది; ఆసంగతి నీసభవారు పూర్తిగా గమనించుచున్నారు; అయితే ప్రస్తుతమాచర్య త్వరితమొనర్చి పూర్తిచేయదగునని ఈసభవారు అభిప్రాయపడుచున్నారు. ఇందుకుగాను భారతయూనియన్ ప్రధానివద్దకు రాయబారము నడుపుటకై యొకబృందము నేర్పరచుమని అ.భా. మహిళామహాసభ స్థాయిసంఘమువారి నీసభవారు కోరుతున్నారు. మరిన్ని రావుకమిటీ వారి సిఫార్సులనుసంస్థానముల ప్రభుత్వములును అవలంబింపవలయునని ఈ సభవారు కోరుచున్నారు.

4 నర్సింగ్ కౌన్సిల్ చట్టము తీర్మానింపబడినందుకీసభవారు కేంద్రప్రభుత్వమును అభినందిస్తున్నారు; యువతులు విస్తారముగా ఈవృత్తిచేపట్టవలసినదని ఈ సభవారు ప్రోత్సహించుచున్నారు, కేంద్రప్రభుత్వమును, రాష్ట్రప్రభుత్వములును వారిస్కీముక్రింద తర్ఫీదుబొందు నర్సులందరికి ఉద్యోగమివ్వవలయుననియు, వారికి చాలినంతజీతము, సరియైనవసతిగృహములు, నిర్ణీతపుపనికాలము మొదలైనవుండవలయుననియు ఈ సభవారుకోరుచు తీర్మానించుచున్నారు.

5 చిరకాలముగా నీ సభవారుదేశమంతటా ప్రసూతివైద్యాలయాలు, శిశుశరణాలయాలు దండిగా నెలకొల్పబడవలెననియు, వానిలో శస్త్రచికిత్సకులు, వైద్యులు, దాదులు నుండవలయుననియుకోరుచున్నారు; ప్రస్తుతము ఆరోగ్యశాఖభారతీయుల హస్తగతమైయున్నదిగాన పైకోరిక అచిరకాలముననే నెరవేరునని ఈ సభవారు ఆశిస్తున్నారు. దేశంలో ఆరోగ్యప్రేక్షకులసంఖ్యకూడా వృద్ధిపొందాలని వారివిధ్యుక్తధర్మములునిరూపింపబడవలెననికూడా ఈ సభవారు అభిప్రాయపడుచున్నారు.

6 భారతదేశానికి స్వాతంత్ర్యము సిద్ధించింది కాబట్టి, భారతప్రజానీకాన్ని అజ్ఞానంనుంచీ ఉద్ధరించవలెననేకోరిక నెరవేర్చుకొను పూర్తిఅవకాశంఏర్పడ్డది; అందుచేత ఈకాన్ఫరెన్సువారు దేశమంతటా నిర్బంధోచిత వార్ధావిద్యావిధానము (Basic Education) వెంటనే ప్రవేశపెట్టుటకు తగినస్కీముల నమలుపరచవలసిన అగత్యమును మరొకసారి పునరుద్ఘాటిస్తున్నారు, ఇంకా—

(అ) శిశుశిక్షణాలయములకు ప్రభుత్వమువారు మరీహెచ్చుగా ధనసహాయంచేయవలెననీ, ఇంకా వానిసంఖ్య తరుచుగాహెచ్చగలందుల కన్నివిధములా ప్రోత్సహించవలెననీ,

(ఆ) అన్నివిధములైన విద్యాలయాలలోను ఫిలుము (సినిమా)లను విలువైన బోధనాసాధనంగా గైకొనవలెననిన్నీ,

(ఇ) నైతికధర్మాలు, పరిపాలనా సంస్థలవివరాలు, దేహపరిశ్రమలో తర్ఫీదు అన్నిస్కూళ్లలో నిర్బంధంగా నేర్పవలెననిన్నీ.

(ఈ) అన్ని హైస్కూళ్లలోను బాలబాలికలకు దాంపత్యధర్మసూత్రములు (Sex-Education) నేర్పాలనిన్నీ,

(ఉ) ప్రాథమికచికిత్స గృహవైద్యోపచారములు అన్నిస్కూళ్లలో నిర్బంధంగా నేర్పాలనీ, ముఖ్యంగా బాలికలకు మాతృకృత్యములు (శిశుపోషణాదికములు) ఇంటిపనులలో మెళకువలు నేర్చుకొనే అవకాశములు కల్పించవలెనని,

(ఊ) నిర్బంధోచిత వార్ధావిద్యావిధానము చక్కగా నమలుపరచవలెనంటే, ముఖ్యంగా తగినంత సంది హెచ్చుగా సుశిక్షితులగు ఉపాధ్యాయినులవసరమనిన్ని,

(ఋ) ఎవరితలితండ్రులు లేక పోషకులైతే 50 రు|| ల లోపు మాసవారీ ఆదాయముకలవారో వారిబిడ్డలకు మధ్యాహ్నపుభోజనమును పాఠశాలల్లో ఉచితంగా పెట్టవలసిందనిన్ని ఈ సభవారు తీర్మానిస్తున్నారు.

[ప్రవేశపెట్టబడినతీర్మానంలో క్లాజు "ఈ" లేదు. సవరణక్రిందవచ్చినది. క్లాజులు (ఊ) (ఋ)లుకూడా సవరణలే. ప్రవేశపెట్టబడిన తీర్మానంలోఉండిన "హైస్కూళ్లల్లో బాలబాలికలకు నిర్బంధసైనికవిద్య ఏర్పాట్లుగావింపవలెను" అనేక్లాజు—48 మంది అనుకూలురు 89 మంది వ్యతిరేకులు కాగా జడిపోయినది. తీర్మానము ప్రవేశపెట్టిన శ్రీమతి తారాబాయిగారు మిగతసవరణ లంగీకరించినదిగాని—"సైనికవిద్య" క్లాజు తొలగించుట కంగీకరించలేదు]

7 బొంబాయిరాష్ట్ర ప్రభుత్వమువారుగావించిన బహుభార్యానిషేధము, వివాహవిచ్ఛేదముల చట్టములు అఖిలభారతమహిళా మహాసభవారు పదేపదేగావించిన తీర్మానములకు కొంతతృప్తిపరచినందుకు వారినభినందించుచు, ఇతరరాష్ట్రప్రభుత్వములున్నూ, సంస్థానముల ప్రభుత్వములున్నూ ఇట్టిచట్టములనే గావింపవలయునని ఈ సభవారు తీర్మానించుచున్నారు.

8 రైల్వే ప్రయాణీకులకు అన్ని రైల్వేలలోను ఇప్పటికన్నా హెచ్చుసౌకర్యములు కలుగవలెనని ఈసభవారు ధృఢముగా తలంచుచున్నారు, రైల్వేకమిటీలకు, కేంద్రసలహాసంఘమునకు, సభ్యులనెన్నుకొను అర్హతగలసంస్థలలో అఖిలభారతమహిళా సంఘోపసంఘమునుగూడ యొకదానినిగాచేర్చవలసినదని ఈ సభవారు కేంద్రప్రభుత్వమందలి రైల్వేశాఖమంత్రిని, రైల్వేఅధికారులను కోరుచున్నారు.

9 నిఖిలప్రపంచపు ఆరోగ్యసమితి కేంద్రస్థానము భారతదేశములో నెలకొల్పబడవలయుననేభారత యూనియన్ ప్రభుత్వమువారికోరికను ఈసభవారు సంపూర్ణముగా బలపరచుచున్నారు.

10 సంచారవైద్యాలయముల నేర్పరుపుడు అని ప్రభుత్వమునుకోరుచు తీర్మానము.

11 ప్రజాసామాన్యానికి చాలా బాధాకరంగానున్న ప్రస్తుతపు కంట్రోలు పద్ధతియందలి లోటుపాట్లను ఈసభవారు పూర్తిగా గ్రహించారు; కాని ప్రభుత్వమువారు కంట్రోలు తొలగించువిధానమును అవలంబించి, ముఖ్యమగు పదార్థములపై కంట్రోలు తొలంగించినందుకు ఈసభవారు తమసంతాపమును వెలిబుచ్చుచున్నారు. ప్రస్తుతము ఆహారపదార్థోత్పత్తి క్లుప్తముగానున్నది, వానినిదిగుమతి అవకాశములును క్లుప్తముగానున్నవి ఇట్టిపరిస్థితిలో కంట్రోలు తొలిగించుటవల్ల, ధరలధికంకావడం, అన్నంలేకమాడడం, తుదకు దుర్మరణాలుకూడా సంప్రాప్తించును-అని ఈసభవారభిప్రాయ పడుచున్నారు, కానీ అందరికీ స్వేచ్ఛగా దుకాణాలలో అన్నిసరకులు పుష్కళముగా దొరికేటంత, అధికోత్పత్తి జరిగేదాక కంట్రోళ్లు తిరిగీ ఏర్పరచ వలసినదని ఈసభవార్లు కోరుచున్నారు, ఇంకా ఆకంట్రోలువిధానం ఫలవంతంగా అమలు జరుగుటకై ఈసభవారీ క్రిందిసలహాలను సిఫారసు చేస్తున్నారు. (అ) రైతుకు న్యాయమైనధర కలుగవలెను. (ఆ) దేశమంతటా అధికోత్పత్తికి తగినవిధానము లవలంబింపవలెను. (ఇ) వస్తువులు పోగుచేసి దాచిపెట్టకుండా, బ్లాక్ మార్కెట్టు చేయకుండా, లంచగొండితనం వృద్ధికాకుండా ఉండునట్లు బందోబస్తు చేయగల సిబ్బంది నేర్పరచవలెను.

12 ఉజ్వలమైన గాంధీమహాత్ములవారి నాయకత్వమున భారతదేశప్రజ స్వాతంత్ర్యము బడసినందుకీ సభవారు తమ ఆనందమును వెలిబుచ్చుచున్నారు; భారతదేశమును సంపూర్ణ స్వతంత్ర ప్రజారాజ్యముగా ప్రకటించవలెనని "భారతస్వాతంత్ర పత్రము"నందు వెలిబుచ్చబడిన "దృఢమును పవిత్రమగు ప్రతిజ్ఞ" చెల్లుటకుగాను తమవంతు కర్తవ్యమును పూర్తిగానెరవేర్చుటకు ఈసభవారు బద్ధకంకణులగుచున్నారు.

13 సంస్థానప్రజల స్వాతంత్ర్య పోరాటముఆశీర్వదించి అది ఫలప్రదము కావలయునని ఈతీర్మానమునసే కోరబడినది.

14 కావలయునని మతోద్రేకము రెచ్చగొట్టబడినది; తత్ఫలితముగా, దారుణమగు దురంతములు గావింప బడినవి; వీనినంతయు ఈసభవారు గర్హించుచున్నారు. మరియు బలవంతముగా మతాంతరులనొనర్చుట, స్త్రీలను శిశువులను అపహరించుకొనిపోవుట, మున్నగువాని నీసభవారు ఖండించుచు వారిని తిరిగీ లభ్యపరచుకొని స్వస్థానము చేర్చుటకై గావింపబడే యత్నములకు తమకుంచి సభ్యురాండ్రను సకలసహాయము చేయుదురని కోరుచున్నారు; ఈదేశములోగల ప్రజలందరి ఐకమత్యముమీదనే ఈదేశమునకురక్షణ, శాశ్వతశాంతి, నిజముగా పురోభివృద్ధి ఆధారపడియున్నదని, ప్రతిపౌరుడును తెలుసుకొనుట ఆతనికిగల సామాన్య నైతికధర్మమని ఈసభవారు ప్రకటించుచున్నారు.

15 మద్రాసు ప్రభుత్వమువారు "సోషల్ సర్వీస్ డిపార్టమెంటు" అని కొత్తడిపార్టమెంటును నేర్పర్చినందులకు తమసమ్మతమును తెల్పుచూ, ఇతరరాష్ట్రములును, కేంద్రప్రభుత్వమును ఇట్టిశాఖలనేర్పరచాలని ఈసభవారు హెచ్చరిస్తున్నారు.

16 ప్రభుత్వమువారు ఈక్రిందిస్కీములు నమలుపరచుదురని ఈసభవారు సిఫారసుచేయుచున్నారు: (i) తక్కువజీతాలకుటుంబాలవారికి ఇండ్లు. (ii) ఇంకావారికి క్రీడాక్షేత్రములు, వినోదస్థలములు ఇతర సౌకర్యములు ఏర్పరచి బాల్యనేరములు (Juevnile Delinquency) లేకుండ నిరోధించుట (iii) 200000 హెచ్చుజనాభాగల ప్రతిపట్టణంలోను బాలబాలికలకు శిక్షణాలయములు ఏర్పరచుట.

17 పాకీస్థానమునుండి భారతయూనియన్‌కు, భారతయూనియన్‌నుండి పాకీస్థానమునకు వలసపోదలచిన మైనారటీల కట్లుగావింప నెట్టిఆటంకములేకుండ చేయవలయును అని ఈతీర్మానము.

18 ఆసియాఖండమందలి వివిధదేశములలో రేకెత్తిన రాజకీయస్వాతంత్రోద్యమమును ఈ సభవారు అభినందించుచున్నారు; అందుముఖ్యముగా ఇండోనేషియాయందలి స్త్రీలు తమదేశ స్వాతంత్ర్య పోరాటమున చూపుచున్న త్యాగసాహసములకు వారిని కొనియాడుచున్నారు.

19 అవివాహితస్త్రీలకు ప్రభుత్వము తత్కాలికముగా ఉద్యోగములిచ్చి వివాహానంతరము వారిని తొలగించుచున్నారు. అట్లు నిరుద్యోగులగు స్త్రీలకు ఉద్యోగములు కల్పింపవలయునని ఈతీర్మానము.

20 ఈతీర్మానమున స్త్రీలందరికి ఈక్రిందిహక్కులుండవలయునని పలుకరింపబడినది; (i) పనిచేయుటకు (ii) అన్నివృత్తులు, అన్ని పరిశ్రమలు అవలంబించుటకు (iii) (పురుషులతో) సమమైనపనికి (పురుషులతో) సమమైన జీతభత్యములు పొందుటకు (iv) తర్ఫీదునందుటకు, ప్రమోషన్ పొందుటకు పురుషులతోపాటు సమానమైన అవకాశములుండుటకు (v) పనిచేయుటకుతగిన మంచిపరతులు కలిగియుండుటకు (vi) సాంఘిక సంరక్షణముయొక్క లాభములు అనుభవించుటకు (vii) వివాహమువల్లగాని, స్త్రీవర్గమునకు చెందినందువల్లగాని ఎట్టిఅననుకూలత లేకుండా కాపాడబడుటకు వగైరా.

[యూనియన్, రాష్ట్రప్రభుత్వముల నీక్రిందివాని నేర్పరపుడని కోరుచు ప్రత్యేకతీర్మానములు గావించినారు.]

21 స్త్రీలసౌకర్యము లరయప్రత్యేక ప్రభుత్వశాఖ.

22 శరణార్థుల ముఖ్యముగా స్త్రీశిశువుల నరయప్రత్యేకశాఖలు.

23 మతముపేరట స్కూళ్ల నేర్పరుపరాదు.

# సంక్రాంతి

శ్రీమతి చదలువాడ నాగరత్నం గారు.



అంగబలముండి పనిదొంగ లగుచు నేదొ
గొణఁగు "సాతాని"వారల గుంపుకెదురు
అరిగి తప్పేల నింపు దయార్ద్రగుణము
క్రాంతికిం గారణమ్ము సంక్రాంతి దినము.

సైకి లుంగరములు పట్టుశాల్వలంచు
అత్తవారింటి భిక్షకై యంగలార్చు
పరమలోభియా జామాతృపతితగుణము
క్రాంతికిం గారణమ్ము సంక్రాంతిదినము.

తనకుఁగల్గిన యాస్తియంతయు సుతులకుఁ
బంచి సమముగ, సుతలన్యలంచు నెంచు
పక్షపాతంపు జనకుని లక్షణమ్ము
క్రాంతికిం గారణమ్ము సంక్రాంతి దినము.

*　　　*　　　*

రంగవల్లులుదీర్చి ముంగురుల్ సరిజేయు ప్రాభాతకాలాన ప్రౌఢయోర్తు
మొగసాలఁ బసుపిడి సిగముడి బిగిజేయు ఉదయ సంధ్యావేళ మదవతొకతె
వడివంటఁజేయఁగా నడుమును బిగియించు పూర్వమధ్యాహ్నాన ముగుదయొకతె
కల్లలఁగుడిపించి కురులను సరిదిద్దు అపరాహ్ణసమయాన నతివయోర్తు
తములమందిచ్చి భోజనాంతరమునందు వీణచేఁబూని మీటెడు మృదులగాత్రి
చిన్నికూనఁడు చంకెక్క క్షీరమాన కులుకు 'గృహలక్ష్మి' సంక్రాంతి మలుపుసంజ.

క్రొత్తయల్లుండ్రకై క్రొత్తబట్టలు దేఁగ పసుపుబొట్టులనును పడతిమిన్న
వింతవిందులుబెట్ట బంతానఁగూర్చొని పిండివంటలు జేయు బిసరుహాక్షి
పరదేశములనున్న భర్త వేంచేయఁగా మనసిగ్గునటియించు ముద్దుగుమ్మ
పళ్ళెరంబులనిండ ఫలహారముంచుకు పతిప్రక్కఁగాఁజేరు పద్మనేత్రి
భార్యమాటుననున్నట్టి బావఁజూచి పరిహసింపగఁజూచెడు మఱదలొర్తు
నగుచు 'గృహలక్ష్ము' లానంద మందునట్టి భాగ్యపర్వంబు సంక్రాంతి వరలెనేఁడు.

వెండికొండలమించ వెల్లవేసెదనంచు ముసుగిడుఁబైఁటను ముద్దుగుమ్మ
పసిడితో సెనయంగ 'బసుపు'ఁబూసెద నంచు పరికిణీ సెగఁగట్టు పల్లెపడుచు
పద్మరాగాలన 'పారాణి' నిడెదంచు పైఠిణీ సవరించు బాలమిన్న
ముత్యాలసరులన ముగ్గులిడుదునంచు ముందుగోచీబోయు ముగ్ధకన్నె
కళ్ళఁగాటుక, పారాణి కాళ్ళకునిడి క్రొత్తపరికిణి సరికొత్త గౌను దొడిగి
సంతసంబున నపుడప్డు స-ని-ధ-యనుచు వరలు సంక్రాంతి పర్వాన 'పల్లెపిల్ల'.

# సామెతలు

16 అరువులసొమ్ము బరువులచేటు, అవి తియ్యను పెట్టను తీపులచేటు, ఆకాస్తా పోతే అప్పులచేటు!

17 ఆపాటిమగడవా, చెవులు తమువుతావు?

18 ఏకులు వడకాలేను, ఎత్తుపెట్టాలేను?

19 కుక్కలు ఏకులువడికితే, గుర్రాలు చీరెలు కడతాయా?

20 కుక్కకాటుకు చెప్పుదెబ్బ.

21 కుక్క ముట్టుకున్న కుండ.

22 అయ్యవార్లంగారి నట్టిల్లు.

23 అయ్యవారిని చేయబోతే కోతి అయినట్లు.

24 అయ్యవార్లంగారి గుర్రం 'ఎషు బోతే, అషే.

25 అయ్యవారు తప్పులువ్రాశి దిద్దుకుంటుంటే, అమ్మగారికి పారబోయను, ఎత్తను; ఎత్తను పారబోయను సరిపోయింది.

26 'ఎక్కడిదీ పెత్తనం?' 'ఆమూలనుంచి నెత్తినేసుకున్నారు.'

27 దారినపోయే శనేశ్వరమా మాయింటిదాక వచ్చిపోవే.

28 శని బడితే ఏడేళ్లు; నేను పడితే ఏడేడు పధ్నాలుగేళ్లు.

29 రామేశ్వరంపోయినా శనేశ్వరం తప్పదాయెను.

30 ఏలడాని కూళ్లు లేవుగాని, ఎత్తుక తినడానికిలేవా?

31 ఉపాయం తెలియనివాణ్ణి ఊరెళ్లగొట్టమన్నారు.

32 ఊరంతా ఒకతోవ, ఉలిపికట్టెకు ఒకతోవ.

33 అందరూ తూర్పుఅంటే, ఆమె దక్షిణమంటుంది.

34 మగవాడబద్ధం చెప్పితే తడికపెట్టినట్లు; ఆడుది చెప్పితే గోడబెట్టినట్లు.

35 ముఫ్ఫై శిఖలు కూడుతాయిగాని, మూడు కొప్పులు కూడలేవు.

36 దూకుడూకు మనేదేగాని తోడు దూకే నాచవితేది?

37 పిండిబొమ్మచేసి పీటమీదబెట్టి 'ఆడబిడ్డ' అనేసరికి, అదిరిపడ్డదట!

38 చిన్నాయనభార్య పిన్నమ్మకాదు; మేనత్తమగడు, మేనమామగాడు.

39 అబ్బురాన అబ్బికి మీసాలువస్తే, అవి ఈచేత ఆచేత సాగదీసేసరికి ఊడిపోయినవట; వట్టిమూతికి ఒక్కచేయిచాలును, అని, రెండవచేతితో తల గోక్కొన్నాడట.

40 అమ్మాబువ్వ; అయ్యాబువ్వ.

త్వరలో !  త్వరలో !!

# యూనిటీ పిక్చర్సు వారి

## విడుదల

# శ్రీ సాయిబాబా



దర్శకుడు :

## పట్టాభి

తారాగణం :

మన్నవ రామచంద్రరావు, అద్దంకి, సి. యస్. ఆర్, పారుపల్లి, కృత్తివెంటి, పొదిలి కృష్ణమూర్తి, రామనాథశాస్త్రి, యస్. నాగేశ్వరరావు, డాక్టరు చంద్రశేఖరరావు, శ్రీమతి భారతీదేవి. మొదలగువారు.

సంగీతము : మల్లిఖార్జున.   నృత్యం : వి. జె. శర్మ.

స్టూడియో : చంద్ర ఆర్టు స్టూడియో.

వ్యాపార వివరములకు : యూనిటీ పిక్చర్సు : మద్రాసు 17.

రాయలసీమ : ఆంధ్రజిల్లాలకు :—విమలా పిక్చర్సు : మద్రాసు 17.

# సంపాదకీయములు

## శ్రీమతి వీణాదాసు వివాహము

పశ్చిమబంగాళమున శాసనసభ్యురాలు శ్రీమతి వీణాదాసుకన్య శ్రీయుత బాబాజ్యోతిష్ భౌమిక్ గారిని వివాహమాడెనని తెలియుటకెంతయు సంతసించితిమి. ప్రతినిత్యము భారతదేశములో ఎన్నివివాహములు జరుగుటలేదు ; ఇందుకింతహర్షమేలందురేమో ! శ్రీమతి వీణాదాసు బి. ఏ. ప్యాసై 1931 లో స్నాతకోత్సవమునకు హాజరైనది. గవర్నరుగారివల్ల పట్టాపుచ్చుకొని మురియుదమనికాదు. నాడుస్వాతంత్ర్యోద్యమమునరికట్ట బ్రిటిష్‌ప్రభుత్వముపూనిన నిర్బంధవిధానముచే దేశమంతయు కీలాభీలమైయుండెను. స్వాతంత్ర్యప్రియులైన యువతీయువకుల హృదయములలో పరాభవాగ్ని ప్రజ్వలించుచుండెను. అందుచే నీకన్య ఆ బ్రిటిష్‌ప్రభుత్వ ప్రతినిధియైన బంగాళీగవర్నరు (సర్ స్టాన్లీజాక్సన్)నుచంపి బ్రిటిష్‌జాతికంతటికి బుద్ధిచెప్పవలెననితలంచెను. ఒకపిస్తోలు సంపాదించి దానితో గవర్నరుపై కాల్చినది. అతడు తలవంచి తప్పించుకున్నాడు. వీణాదాసుకన్య పారిపోక అచలస్థైర్యమున నిలిచియుండగా పట్టుబడి-యావజ్జీవ శిక్షితురాలాయెను. ఆమెకృత్యమును మేముసమ్మతింపము. కాని ఆమెహృదయ కుహరమున కుములుచున్న తేజోవంతమగు దేశభక్తికి, పరాభవముసహింపని స్వాతంత్ర్యదీప్తికి, ఎవ్వరుజోహారులొనర్పరు? అట్లు ఆమె తనశిక్షాకాలమునుగడిపి రెండేండ్లక్రిందటనే విడుదలైనది. శాసనసభ్యురాలై సౌమ్యపద్ధతుల ప్రజాసేవ గావించుచు నేడువివాహితయైనది. భర్తయు దేశసేవయందు ముక్కాకలదీరిన వాడేనట. ఇట్టిగృహలక్ష్ములుగన్న సంతానము-చిరంజీవులై, పద్మవ్యూహముల జొచ్చుటేగాక వెడలివచ్చుటయు నేర్చిన అభిమన్యుకుమారకులై భారతస్వాతంత్ర్యమును రక్షింపగలరు. ఈనూత్న వధూవరులకు చిరాయురారోగ్యైశ్వరములున్నూ, పుత్రపౌత్రాభివృద్ధియున్నూ కలుగుగాకయని "గృహలక్ష్మి" దీవించుచున్నది.

## కాశ్మీర హిందూస్త్రీల విక్రయమా?

కాశ్మీరదేశము చల్లనిప్రదేశము. అచ్చటస్త్రీపురుషుల అందచందములు లోకప్రసిద్ధములు. అందుముఖ్యముగా హిందూస్త్రీలు పుత్తడిబొమ్మలు, శశిరేఖలు. పూజనీయులైన అట్టివనితారత్నములను ఇటీవలన అల్లరులలో ముసల్మాను దుండగీండ్రుగొంపోయి, కాబూలు, పశ్చిమోత్తర పరగణాలలో ఒక్కొక్కతెను రు 4-0-0 లు వంతున అతినీచముగా వీధినపెట్టి విక్రయించుచున్నారని ఢిల్లీ నడివీధులలో ప్రబలమైన వదంతులుగానున్నది. ఇదికేవలము పుక్కిటపురాణముగానోపదు. ఏమంటే, సివిల్ అండ్ మిలిటరీ గెజట్‌వంటి ఆంగ్లోయిండియన్ పత్రికయే దీనిని ప్రచురింపసాహసించినది. ఇది స్త్రీలోకమునకేగాక మానవుడైనవానికెల్ల తలవంపులైనవార్త. తమస్త్రీలను పరదాలలో బురఖాలలో మూతపెట్టి, దాచిపెట్టు ముసల్మానులు పరమతస్థులైనంతమాత్రమున స్త్రీలనిట్లేల అవమానపర్చవలయునో?

# ఆలిండియా రేడియో — మదరాసు

## మహిళామండలి "కార్యక్రమాలు"

### జనవరి 15 తే, నుంచి 31 - వ వరకు

జనవరి-1948

17 వ తేదీ శనివారము: సంతత సంపద-వాద్య చిత్రము. ప్రాపకము- నాటిక, పుష్పాంజలి-భావగీతము, మహిళాలోకము,

20 వ తేదీ మంగళవారము: సౌఖ్యంచేద ? భావగీతము, స్త్రీలు చెయ్యతగిన ఉద్యోగాలు-నర్సు-ప్రసంగము, విఖ్యాత నారీమణులు-ఫ్లారెన్స్ నైటింగేల్ ప్రసంగము

22 వ తేదీ లక్ష్మీవారము: స్త్రీలు తెలుసుకోవలసిన విజ్ఞానము-భౌతికశాస్త్రము-ప్రసంగము సృష్టిలో-బాలసరస్వతి పాడిన పాట రికార్డు, వీటి మాట ఆలోచించారా?-స్త్రీలకు ప్రత్యేకస్థలము-ప్రసంగము

24 వ తేదీ శనివారము: కుప్ప నూర్పుపాట-జానపదగీతము, ఆకుకూర-తమలపాకు-ప్రసంగము

27 వ తేదీ మంగళవారము. ధర్మరాజ జూదము-పాట, స్త్రీ-పురుషుల నిర్వచనాలు టాల్‌స్టాయి అభిప్రాయాలు, మీరు చదివారా? పుస్తక విమర్శ

30 వ తేదీ లక్ష్మీవారము: స్త్రీలు తెలుసుకోవలసిన విజ్ఞానము చరిత్ర-ప్రసంగము ఎవరికో ఏటికో-బి. ఎస్. పద్మావతి పాడినరికార్డు, చూలాలి వ్యాధి రక్షణవిధులు వేవిళ్లు-ప్రసంగము

31 వ తేదీ శనివారము: అష్టపది, తారాపథము-పరిచయము, ఊడ్పుపాట మహిళాలోకము మంగళము.




ప్రకృతిచికిత్సా విధానము:—

ఈగ్రంథమును రచించిన గ్రంథకర్త శ్రీ కందాళ సూర్యనారాయణ బి. ఏ గారు దీనిని మావిమర్శనార్థమంపగా కృతజ్ఞతతో స్వీకరించినాము. మానవునిబుద్ధివిశేషము పెంపొందేకొద్దీ ఆహారవిహారాలలో నైజ విధానము కృత్రిమపద్ధతులకు క్రమముగా తావిస్తున్నది. వాటితోపాటు వ్యాధులు, వాటిచికిత్సా విధానాలు కూడా రూపుదాలుస్తున్నవి. ప్రస్తుతం దేశంలో అమలులోవున్న వైద్యవిధానాలు, ఆయుర్వేదము, యునానీ. ఆలోపతి, హోమోపతి ప్రకృతిచికిత్సా మున్నగునవి. సిద్ధౌషదిమార్గము ఆయుర్వేదములోనే యొకమార్గము; ఇందు భస్మాదులు హెచ్చనితోచును. వీటన్నిటిలో—ఆయుర్వేదమే ప్రకృతికి సామీప్యము; కేవలము ప్రకృతికాకున్నా ప్రకృతికి ప్రతిబింబము. అయితే ప్రపంచములో గతశతాబ్దిలో వివేచనాపరులు- ఆయావైద్యా విధానముల కృత్రిమపద్ధతులపై తీవ్రవ్యతిరేక భావముదయించినవారు ప్రకృతి నాశ్రయింప నారంభించిరి. దానివల్ల ఇతరవైద్యా విధానములవల్ల కుదరనివ్యాధులుకూడా కుదరనారంభించినవి. కావున ఈవైద్యవిధానము సులభముగా శీఘ్రముగా ప్రజలలో సమ్మకముకుదుర్చ నారంభించినది. ఈవైద్య విధానములో తిరిగీ ఆదికాలములనాటి గంగాస్నానములు, మృత్తికాస్నానములు. వాయు, పర్ణాంబు, భక్షణలు. కందమూల శాకఫలాహారములు, సూర్యనమస్కారములు- ఆశ్రయింపబడినవి ఈవైద్య విధానము వేదకాలమునాటిదైనను దీనికాధునికకాలంలో ప్రతిష్ట కల్పించినవారు లూయీ ఖూన్‌దొరగారు. ఇతడు ఆధునికులకు శాస్త్ర విజ్ఞానశాస్త్ర సూత్రములద్వారా నచ్చచెప్పగలిగేడు; పాశ్చాత్యవిజ్ఞాన వ్యామోహితులగు భారతీయులకు దొరమాట సమ్మతమైనది-ఇట్లు ఖూన్‌దొరగారి ప్రబోధములకు వశులైనఒకానొక పురుషులు శ్రీ కందాళ సూర్యనారాయణ బి. ఏ గారు; వీరు మద్రాసుప్రభుత్వమువారి తెలుగుటాన్సు లేటర్లు. శ్రీ సూర్యనారాయణగారు కేవలము పుస్తకగ్రహణ శాస్త్రజ్ఞానము వెలయించలేదు. 16 సం॥లుగా తామీవైద్య విధానమును తమవిషయమున ఇతరులవిషయమున అవలంబించి అందలి ఫలితములను పరిశీలనతో గమనించి విమర్శించుకొనగా తేలిన సారాంశమునే ఇందు పొందుపరచియున్నట్లు ఈగ్రంథము నామూలాగ్రము చదువగా తేలుచున్నది. 50 సం॥ లుగా నీఖూన్‌దొరగారి తొట్టిస్నానములు చేయుచుండిన శ్రీ వెదురుమర్తి వెంకటరత్నంగారు-వీరి ఈగ్రంథమునుచదివి-ఆస్నానములు నిర్ణయించిన ఖూన్‌దొరగారి నిజాభిప్రాయముల నీగ్రంథమువలె మరియేగ్రంథముకాని వివరించుటలేదని వ్రాసియున్నారు. ఇందు శ్రీ సూర్యనారాయణగారాయా స్నానములు చేయునప్పటి బొమ్మలుకూడా వేయబడియున్నవి. "ఆకుకూరలు మానవాహారముగావు" "ఆకులు మలబంధముచేయును." "పంచదార చెడ్డది." "తేనె మంచిదికాదు; విసర్జనీయము" "ఉన్నిబట్టలను వాడవద్దు." "పాలలో పంచదార, పటికబెల్లము వేయరాదు" "కాఫీ, టీలు కోకో, ఓవల్‌టిన్‌లు ఇట్టివన్నియు పనికిరావు" "నశ్యము వర్జనీయము"-ఇత్యాది వాక్యములు సామాన్యులకు విపరీతముగా నుండవచ్చునుగాని ఈగ్రంథకర్త సకారణముగా వీనిని రూపించుచున్నారు- కావున ఈగ్రంథమునుచదివినవారు అనుభవజ్ఞులైన ప్రకృతి చికిత్సకులులభ్యముగాను ఈవైద్యమునవలంబింపక పోవచ్చునుగాని-అనేకరోగములకు మూలకారణములగు ఆహారవిహారాదులు విసర్జించి పలురోగములబారి పడకుండ చాలవరకు తప్పించుకోవచ్చునని తోచెడివి. కావున ఈగ్రంథము ప్రతియింట ప్రతిస్త్రీ పురుషుడు చదువతగినది. దీనివెల రు 5-0-0 లు. ప్రయువారు ప్రకృతి చికిత్సాసదనము. సాదుల్లావీధి త్యాగరాయనగరము, మద్రాసు అనివ్రాసిన బడయుగలరు.

## దంపుడు బియ్యము:—

ఇదియొక చిన్నకరపత్రము. పైగ్రంథమురచించిన కందాళ సూర్యనారాయణగారే రచించియున్నారు. ఇందు మిల్లుబియ్యముకన్న-దంపుడుబియ్యము ఎట్లు ఆరోగ్యకరమో చక్కగా నిరూపింపబడినది. ఇటీవల బియ్యమునకు రేషను బెట్టి చాలిచాలకుండ ప్రజలకు భత్యముకొలిచిన మద్రాసుప్రభుత్వము-మిల్లుబియ్యము కన్న పుష్టికరమగు ఆహారముకాగల "దంపుడుబియ్యము"ను ప్రోత్సహించుటకై ఈకరపత్రమును శ్రీ సూర్యనారాయణగారి అనుమతితో 13000 ప్రతులనచ్చొత్తించి పంచిపెట్టినారన్న దీనిప్రాశస్త్యము వేరుగ చెప్పనక్కరలేదు.. ఇది ప్రతిగృహిణియు చదువదగినది. దీనివెల రు 0.3.0 మాత్రమే. పైగ్రంథము దొరకు చోటనే ఇదియుదొరకును.

## సమత:—

శ్రీ వేలూరి సదానందంగారు ప్రచురించుచున్న మాసపత్రిక. దీనిపేరునుబట్టియే భిన్నత్వములోగల ఏకత్వమునిది ప్రోత్సహించునని తెలియగలదు. కావున సంఘమున స్త్రీకిగల తక్కువతనమునిది ఖండించి పురుషునితో "సమత"ను ఘటించునని తలంపవచ్చును. దీనియందలి వ్యాసములు ఆ అభిప్రాయములను బలపరచగలవు. ఇంకను ఇది యెన్నియోవిధములనభివృద్ధి కోరుచున్నది. సంపాదకులు ఉత్సాహమునకు. విషయజ్ఞానమునకు.తోడుసన్నాహశక్తి, వివిధవిషయముల సమభావము-అవలంబించుచో ఈపత్రికయు రాణించగలదు. వలయువారు 4, మాంటీయత్ లేన్, ఎగ్మూరు పోస్టు, మద్రాసు అనివ్రాయుడు.

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd. 15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.